
రామ్, శ్యామ్‌ల సాహసకార్యాలు
రాక్షసిపై విజయం


"అదొక అడవి— చీకటి రాత్రి
వేరెరొక కుటీరం—
అదొక విడ్డూరం


చుట్టూ కుందేళ్లు—
కప్పలున్నాయి. మచ్చుకైనా మనిషి
జాడే లేదు


"బాబోయ్!" వేసేరు—
బెదురు కేక
మాటలాడ సాగేయి—
జంతువుల మూక


"కరుణించండి!—
రక్షించండి!
మేమొకప్పుడు—
మనుష్యులమే
నండి!"


భళ్ళా భళా ఉరిమింది—
రాక్షసి దిగింది
చీపురు విమానం నుంచి—
గుడ్లు ఉరిమింది


"చిక్కేరు చేతుల్లో!"—
అది ఇకిలించింది
"మార్చేస్తా కప్పల్లా!"
బెకబెకలాడింది


రామ్, శ్యామ్‌లు—
తక్కువేం తినలేదు
పాపిన్స్ ప్యాకెట్లు—
పైకి విసిరేరు


రాక్షసి సంతోషంతో—
సకిలించింది
నిక్షేపంగా అందరిని—
విడుదల చేసింది

# ఈ మూడు సుగుణాలను ఇవ్వగలిగినది రూబీ డస్ట్ టీ మాత్రమే

**1.** తక్షణమే డికాక్షన్

**2.** నిండైన పరిమళం

**3.** ప్రతి పొట్లానికి ఎక్కువ కప్పుల టీ

Superb Teas
SELECTED FOR STRENGTH AND FLAVOUR
RUBY DUST

చిక్కదనము మరియు పొదుపుతో కూడిన ఒకే ఒక్క టీ లిప్టన్ రూబీ డస్ట్. లిప్టన్ రూబీ డస్ట్ - నిండైన కమ్మదనము, మెండైన సువాసన కలిసి మెలిసే టీ.



## లిప్టన్ రూబీ డస్ట్

ప్రతి ఒక్క ప్యాకెట్టుకు అధిక కప్పుల, రుచికరమైన టీని ఇస్తుంది

LRDC-10 TEL

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి!



## చదువులలో సర్వశ్రేష్ఠత ...
## ఆటలలో అగ్రగణ్యత

చదువుల్లో ఆటల్లో హరింపు అయే శక్తిని పిల్లలకు తిరిగి సమకూర్చక పోతే వారి మానసిక శారీరక వికాసానికి ఆటంకం కలుగుతుంది. ప్రతి దినం వారు బోర్న్‌విటా త్రాగటం వలన పిల్లల శక్తి పెరుగుతూ ఉంటుంది. పుష్టికరమైన కోకో, పాలు, మాల్ట్ మరియు పంచదారలతో తయారైన బోర్న్‌విటా రుచికరమైనది.

పోషకమైన బోర్న్‌విటాలో కోకో ఉన్నది. అది ఆరోగ్యకరం, రుచికరం కూడా.






శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!

OBM 0449 TEL












చందమామ







# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [" విడిపోయిన మిత్రులు"] కె. నాగేశ్వర రావు రచన.

రంగుల బొమ్మల సీరియల్ "యక్ష పర్వతం" ఈ సంచికతో ముగిసింది. పై నెల నుంచి "విచిత్రకవలలు" రంగులబొమ్మల సీరియల్ నడుస్తుంది.

"మృచ్ఛకటికం" అనే నాటకంలో రాజుగారి బావమరిది స్యాలకుడు అనే దుష్టపాత్ర ఉన్నది. "రాజుగారి బావమరిది" అన్న కథలో వ్యంగ్యానికి ఆధారం ఈ స్యాలకుడి పాత్రే.

సంపుటి 54 జూన్ '74 సంచిక 6

CP

CHITRA




సత్సంగాత్ భవతి హి సాధుతా ఖలానాం.
సాధూనాం న హి ఖలసంగమాత్ ఖలత్వం:
ఆమోదం కుసుమభవం మృదేవ ధత్తే,
మృద్గంధం న హి కుసుమాని ధారయంతి. 1

[మంచివాళ్ళ స్నేహం వల్ల దుర్మార్గుడికి మంచితనం అబ్బుతుంది గాని దుర్మార్గుడి స్నేహం వల్ల మంచివాడికి దుర్మార్గం అంటదు. పువ్వు మీద పడిన మన్నుకు పువ్వు వానన అంటుతుంది గాని, మట్టిలో పడిన పువ్వుకు మట్టి వానన అంటదు.]

కర్పూరధూళీరచితాలవాలః,
కస్తూరికా కుంకుమ దోహదశ్రీః,
పన్నీరనీరై రభిషిచ్యమానః,
ప్రాంచం గుణం ముంచతి కిం పలాండుః? 2

[ఉల్లికి కర్పూరపు పిండితో పాదుచేసి, కస్తూరీ, కుంకుమపువ్వూ ఎరువు వేసి, పన్నీరు పోసి పెంచితే మాత్రం తన వాసనను విడిచిపెడుతుందా?]

విద్యయా విమలయా ప్యలంకృతో
దుర్జనః సదసి మాస్తు కశ్చన;
"సాక్షరాః" విపరీతతాం గతాః
కేవలం జగతి తేపి "రాక్షసాః". 3

[స్వచ్ఛమయిన విద్య కలవాడైనప్పటికీ దుష్టుడు సభలో ఒక్కడు కూడా ఉండడు. అలాటి వాళ్ళు "సాక్షరాః" (చదువుకున్న వాళ్ళు) లోకంలో తలకిందులై "రాక్షసాః" (రాక్షసులు) అవుతారు.]



# యక్షపర్వతం

## 25

[ఖడ్గజీవదత్తులూ, మణిభూషణుడూ విడిది చేసిన చోటుకు రాత్రివేళ ఒక రాక్షసి వచ్చింది. దాని భర్త ద్వారా జీవదత్తుడు యక్షపర్వతాన్ని గురించిన కొన్ని రహస్యాలు తెలుసుకున్నాడు. నడిరేయి వేళ మణిభూషణుడు ఏదో అలికిడి విని, నిద్ర మేల్కొని, రాక్షసులు వచ్చి మీద పడుతున్నారని అరవసాగాడు. తరవాత—]

మణిభూషణుడి అరుపులు వింటూనే జీవదత్తుడు నిద్రలేచాడు. ఖడ్గవర్మ మణిభూషణుడికి ధైర్యం చెబుతూ, "మణిభూషణా, నీకొచ్చిన భయం ఏమీ లేదు. ఆ వచ్చిన యిద్దరు రాక్షసులకూ నువ్వు యక్షమణిరంజితుడివి కాదనీ, అతడి సేవకుడివైన మణిభూషణుడి వనీ చెప్పాను. వాళ్ళు నా మాటనమ్మి వెళ్ళి పోయారు," అన్నాడు.

ఆ తరవాత మణిభూషణుడికి నిద్ర పట్టలేదు. తెల్లవార్లూ అతడు మేలుకునే వున్నాడు. సూర్యోదయం అవుతూనే ఖడ్గ జీవదత్తులు లేచారు. అందరూ కాల కృత్యాలు ముగించి, తిరిగి పడవ దగ్గిరకు పోయారు. మణిభూషణుడు పడవను తీరానికి దగ్గిరగా నడపసాగాడు.

ఒక అరగంట కాలం గడిచిన తర వాత పడవ తీరం పక్కగా ఒక చోట



ఆగింది. అక్కడ నది కొండ పక్కన ఒక మలుపు తిరగటంతో చిన్న రేవు ఏర్పడింది. మణిభూషణుడు పడవను అందులోకి పోనిచ్చి, ఒడ్డుకు దిగుతూ, "ఇదే యక్షపర్వతం! ఇక మీరు దిగ వచ్చు. అరెరె, నా యజమాని మణి రంజితుడు, మనలను కలుసుకునేం దుకు యిక్కడికి స్వయంగా వచ్చాడు," అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు పడవలోంచి ఒడ్డుకు దిగి, కొండకేసి తలలెత్తి చూశారు. అక్కడ వున్న ఎగుడు దిగుడు రాళ్ళల్లో ఒక దానిమీద యువకుడైన యక్షుడొకడు నిలబడి వున్నాడు. అతడి చేతిలో చిన్న గద వున్నది. అతడు కన్నార్పకుండా ఖడ్గ జీవదత్తుల కేసే చూస్తున్నాడు.

ముందు మణిభూషణుడు దారి తీయగా ఖడ్గ జీవదత్తులు ఆ యక్షుణ్ణి సమీపించారు. అతడు ఖడ్గ జీవదత్తుల కేసి తీవ్రదృష్టితో చూస్తూ, "ఖడ్గ జీవ దత్తుల్లారా! మీ దుస్సాహసం నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేస్తున్నది. బుద్ధిః కర్మానుసారిణీ, అన్నారు పెద్దలు. పాపం, మిమ్మల్ని అని ఏం లాభం," అన్నాడు.

జీవదత్తుడు, మణిరంజితుణ్ణి ఆ పాద మస్తకం ఒకసారి పరీక్షగా చూసి, చిరు నవ్వు నవ్వుతూ, "మణిరంజితా! రాజ కుమారి పద్మావతికి, యిక్కడున్న రాతి రథాన్ని కదిలించిన వాడు మహావీరు డన్న అభిప్రాయం కలిగించి, ఆ పని మీద యిక్కడికొచ్చే వారిని హతం చేయాలని నువ్వు మంచి పథకమే వేశావు. అదే నీ కంఠానికిప్పుడు ఉరితాడు కాబోతున్నది. ఏరీ, నువ్వు చెరబట్టి తెచ్చిన పద్మావతీ, వసంతకుమారీ రాజ కన్యలు? ఆ రాతిరథం ఎక్కడ?" అన్నాడు.

ఆ మాటలకు మణిరంజితుడు ఉగ్రుడైపోయి చేతనున్న గద ఎత్త బోయేంతలో, ఖడ్గవర్మ కత్తిపిడి మీద

చేయివేసి, "మణిరంజితా, ఆ రాతి రథాన్ని మేం కదిలించ లేనప్పుడు నువ్వు మా యిద్దర్నీ చంపే ప్రయత్నం చేయవచ్చు. అప్పుడు వసంతకుమారి మాట ఏమోగాని, పద్మావతి మాత్రం నిన్ను మహావీరుడుగా భావించి తప్పక వివాహం ఆడుతుంది. కనక, ముందు ఆ రాతిరథం ఎక్కడున్నదో చూపించు." అన్నాడు.

మణిరంజితుడు కోపంగా ఏదో అనబోయేంతలో మణిభూషణుడు అతడితో, "తొందరపడకు, మణిరంజితా! ఈ యువకులను ముందు ఆ రాతిరథం దగ్గిరకు తీసుకుపో," అన్నాడు.

మణిరంజితుడు కాస్త స్థిమితపడి బయలుదేరాడు. కొద్దిసేపటికల్లా వాళ్ళు కొండ మీద సమతలంగా వున్న ఒక ప్రదేశాన్ని చేరారు. దానికి దిగువ ప్రదేశమంతా ఫలవృక్షాలతో, పూలతోటలతో ఎంతో రమణీయంగా వున్నది. ఆ తోటల మధ్య ఒక దానికొకటి కొంచెం ఎడంగా రథాకృతిలో వున్న రెండు భవనాలు వున్నవి. అందులో ఒక దాని మీద ఇద్దరు యువతులు నిలబడి ఖడ్గ జీవదత్తుల కేసి చూస్తున్నారు.

జీవదత్తుడు, ఆ యువతుల కేసి ఓమారు చూసి, "మణిరంజితా, వారేనా




నువ్వు తెచ్చిన రాజకుమార్తెలు పద్మావతి, వసంతకుమారీ?" అని ప్రశ్నించాడు.

"అవును, మీ శౌర్యపరాక్రమాలు కళ్ళారా చూసేందుకు వాళ్ళక్కడ నిలబడి వున్నారు," అంటూ మణిరంజితుడు తల పక్కకు తిప్పి, "ఇదుగో, ఈ కనబడేదే రాతిరథం!" అన్నాడు పళ్ళు కొరుకుతూ.

అక్కడకు దాపులనే దాదాపు ఇరవై అడుగుల ఎత్తున్న ఒక రాతిరథం వున్నది. ఆ రథం వున్న చోటు నుంచి దిగువకు కొండ ఏటవాలుగా పరుచుకుపోయింది. ఖడ్గ జీవదత్తులు ఆ రథం కేసి బయలుదేరగానే మణిరంజితుడు,



"మణిభూషణా!" అంటూ పక్కకు
తిరిగిచూశాడు. కాని మణిభూషణుడు
ఆ చుట్టుపక్కల ఎక్కడా లేడు.

తన మిత్రుడు యిలా చెప్పాచెయ్య
కుండా వెళ్ళిపోయి నందుకు ఆశ్చర్య
పడుతూ మణిరంజితుడు రాతిరథం
దగ్గిరకు వెళ్ళాడు. ఆ సరికి ఖడ్గ జీవ
దత్తులు రథం చుట్టూ ఓ మారు తిరిగి
చూశారు. జీవదత్తుడు వంగి రథం
అడుగు భాగాన్ని ఖడ్గవర్మకు చూపుతూ,
"ఖడ్గా, ఈ రథం కొండలో మలిచినది
కాదు, వేరుగా యిక్కడ పడివున్న
రాతిని రథంగా చెక్కారు. దిగువ నుంచి
సన్నని వెలుగూ, మనుషులు మాట్టాడు
కుంటున్నట్టుగా, అస్పష్టమైన ధ్వనులూ
వినిపిస్తున్నవి," అన్నాడు.

జీవదత్తుడు యిలా అనగానే మణి
రంజితుడు కత్తిదెబ్బ తిన్న వాడిలా
ఎగిరి గంతేసి, "రథం అడుగు నుంచి
వెలుగూ, మాటలూ నీకు వినబడు
తున్నవా? అసంభవం! అసంభవం!"
అన్నాడు.

"అసంభవం ఎలా అవుతుంది?
కొండ లోపల వున్న మణి మాణిక్యా
లనూ, బంగారాన్నీ తవ్వి బయిటికి తీసే
నీ బానిసలందరూ మూగవాళ్ళు కాదు
గదా? ఏమంటావు?" అన్నాడు జీవ
దత్తుడు కోపంగా.

మణిరంజితుడు ఒక్క క్షణకాలం
నిశ్చేష్టుడై, "ఈ సంగతి నీ కెవరు
చెప్పారు? ఆ దుష్టుడు మణిభూషణుడా?"
అన్నాడు రౌద్రంగా.

"పాపం, ఆ మణిభూషణుణ్ణి నిందిం
చకు. అతను నీకు సేవకుడో, మిత్రుడో
కూడా మాకు అర్థంకాని పద్ధతిలో నిన్ను
గురించి మాట్టాడాడు. నేను నా దివ్య
దృష్టితో ఈ యక్షపర్వతానికి సంబం
ధించిన రహస్యాలన్నీ తెలుసుకున్నాను."
అన్నాడు జీవదత్తుడు నవ్వుతూ.

మణిరంజితుడు కోపంతో ముక్కు
పుటాలు అదురుతూండగా, "జీవదత్తా,

యీ ప్రగల్భాలకేంగాని, రాతిరథాన్ని కదిలించగలవేమో ప్రయత్నించి చూడు. నీ శక్తి సామర్థ్యాలను కళ్ళారా చూసేందుకు పద్మావతి ఆ భవనం మీద నిలబడి వున్నది," అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మకు కనుసైగ చేసి, దాపుల కొండదిగువున రథాకృతిలో వున్న భవనాల కేసి చేయిచూపుతూ, "రాజకుమార్తెలు నిలిచివున్న భవనం పక్కనున్న ఆ అందమైన భవనం నీ నివాసగృహమే కదా, మణిరంజితా?" అని అడిగాడు.

"అవును. ఈ ప్రశ్న అడగవలసిన అవసరం నీకెందుకు కలిగింది?" అన్నాడు మణిరంజితుడు.

"ఆ భవనం యిప్పుడు తునాతునియలై నేలమట్టం కాబోతున్నది. ఇదుగో, చూడు!" అంటూ జీవదత్తుడు మంత్రం జపించి, దండాన్ని రాతిరథానికి గట్టిగా అనించి, కాలితో ఒక్క తన్ను తన్నాడు.

ఆ వెంటనే భూమి బద్దలవుతున్నంత భయంకరమైన శబ్దంతో రాతిరథం కదిలి, ఏటవాలుగా వున్న కొండ దిగువకు బాణవేగంతో పోయి, మణిరంజితుడి భవనాన్ని ఢీకొట్టింది. భవనం, దానితో పాటు రాతిరథం ఫెళఫెళా రావాలతో ముక్కలు చెక్కలయినై. విరిగిన కొన్ని భవన భాగాలూ, రాతిరథం ముక్కలూ అంత ఎత్తున పైకెగిరి, దాపులనున్న ఉద్యానవనంలో చెల్లా చెదురుగా పడినై.





కనుమూసి తెరిచేంతలో జరిగిపోయిన యీ భయంకర సంఘటన చూసి మణిరంజితుడు నిలువెల్లా కంపించిపోయాడు. అయినా, అతడు ఒక్క క్షణకాలంలో తెప్పరిల్లి చేతనున్న గదను జీవదత్తుణ్ణి కొట్టేందుకు పైకెత్తాడు. కాని, అంతలో ఖడ్గవర్మ కత్తిదూసి అతణ్ణి ఎదుర్కున్నాడు.

జీవదత్తుడు సంతోషం పట్టలేక ఒక్కసారి పెద్దగా నవ్వి, తనకు గంధర్వ వసుమతి యిచ్చిన కంచుఢక్కను చేతికి తీసుకుని గట్టిగా మోగించాడు. ఆ మరుక్షణం, రాతిరథం కదిలిపోగా దిగువ ఏర్పడిన బిలంలో నుంచి కొందరు రాక్షసులూ, గంధర్వులూ బిల బిలమంటూ కొండపైకి వచ్చి, గోల గోలగా అరవసాగారు.

జీవదత్తుడు వాళ్ళనందరినీ నిశ్శబ్దంగా వుండమని చెప్పి, ''మీరందరూ యీ క్షణం నుంచీ స్వేచ్ఛా జీవులు. ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపొండి,'' అని కంచుఢక్కను పైకెత్తి పట్టుకుని, ''ఈ కంచు ఢక్కను మా దేశ ప్రాంతాల ప్రవాసంలో వున్న వసుమతి అనే గంధర్వుడు నాకిచ్చాడు. మీలో గంధర్వులెవరైనా వుంటే దీన్ని నిరభ్యంతరంగా తీసుకుపోవచ్చు,'' అన్నాడు.

గంధర్వుల్లో ఒకడు ముందు కొచ్చి, జీవదత్తు డిచ్చిన కంచు ఢక్కను తీసుకుని కళ్ళ కద్దుకున్నాడు. జీవదత్తుడు విముక్తులైన రాక్షసులకూ, గంధర్వులకూ ఏదో చెప్పబోయేంతలో, ''అబ్బా!'' అన్న మణిరంజితుడి చావుకేక వినిపించింది. జీవదత్తుడు తలతిప్పి చూశాడు. ఖడ్గవర్మ, మణిరంజితుణ్ణి గాయపరిచి, అతడు నేల మీద పడిపోగా, అతడి గుండెల మీద కాలుపెట్టి, కత్తిని అతడి కంఠానికి గురిచేసి నిలబడి వున్నాడు.

ఆ దృశ్యం చూసి జీవదత్తుడికి కలిగిన ఆనందం అంతా యింతా కాదు. ఖడ్గవర్మ, జీవదత్తుడితో, "జీవా, ఈ దుర్మార్గుడైన మణిరంజితుణ్ణి చంపటమా, వదల

టమా? వీడు రాజకుమార్తెలను అపహరించి తెచ్చి, వాళ్ళకేకాక, వాళ్ళ తల్లిదండ్రులకు కూడా మానసికక్షోభ కలిగించాడు," అన్నాడు.

ఆ సమయంలో అక్కడికి రాజకుమార్తెలు పద్మావతీ, వసంతకుమారీ వచ్చారు. వసంతకుమారి కళ్ళెర్రచేసి కిందపడివున్న మణిరంజితుడి కేసి చూస్తూ, "ఈ నీచుడైన యక్షుణ్ణి చంపిన వీరుణ్ణే వివాహం ఆడతానని నేను ప్రతిజ్ఞ చేశాను. వీడి మరణం నేను కళ్ళారా చూడకపోతే, ఇక నేను జీవితకాలమంతా బ్రహ్మచారిణిగా వుండవలసిందే!" అన్నది.

ఖడ్గవర్మ, వసంతకుమారి కేసి చూసి, ఆమె అద్భుత సౌందర్యానికి ముగ్ధుడైపోయాడు. ఆమెను భార్యగా పొందాలంటే మణిరంజితుణ్ణి తాను చంపి తీరాలి! ఈ ఆలోచన రాగానే అతడు కత్తిని మణిరంజితుడి కంఠంలో గుచ్చేందుకు పైకెత్తాడు. అంతలో ఆకాశం నుంచి, "ఆగండి!" అన్న భీకరస్వరం వినిపించింది. అందరూ తలలు పైకెత్తి చూశారు.

హంసాకృతిలో వున్న విమానం ఒకటి వాళ్ళ ముందుకు వచ్చి, నేల దిగింది. అందులో నుంచి యక్షరాజూ, మణి



భూషణుడూ బయిటికి వచ్చారు. యక్షరాజు అక్కడ వున్న అందరి కేసీ ఓమారు చూసి, "ఖడ్గ జీవదత్తుల్లారా! మీరు మహా వీరులు, సందేహం లేదు. జరిగిన సంగతులన్నీ మణిభూషణుడి ద్వారా విన్నాను. యక్షవంశంలో చెడబుట్టిన యీ మణిరంజితుణ్ణి ప్రాణాలతో వదలండి. వాడు యీ నాటి నుంచీ బతికి వుండీ కూడా, జీవచ్ఛవం!" అన్నాడు.

ఖడ్గవర్మ ఏమి చేయటమా అని సందేహిస్తున్నంతలో జీవదత్తుడు, "ఖడ్గా, యక్షరాజు చెప్పింది విన్నావు కదా? మణిరంజితుణ్ణి క్షమించి వదిలెయ్యి.", అన్నాడు.

"వీరపుర రాజకుమార్తె వసంతకుమారి ప్రతిజ్ఞ మాటేమిటి?" అన్నాడు ఖడ్గవర్మ, ఆమె కేసి నిశితంగా చూస్తూ.

వసంతకుమారి ఎక్కడలేని సిగ్గుతో తల వంచుకుని, పద్మావతి చాటుకు పోవాలని చూసింది.

యక్షరాజు చిరునవ్వు నవ్వి, "మణిరంజితుడు బతికుండీ చచ్చినవాడి కిందే లెక్క అని యింతకుముందే చెప్పాను గదా? అందువల్ల వసంతకుమారిని ప్రతిజ్ఞాభంగ దోషం అంటదు. ఇప్పుడు నేనే స్వయంగా రాతిరథం కదిలించిన మహావీరుడైన జీవదత్తుడితో పద్మావతికీ, ఖడ్గవర్మతో వసంతకుమారికీ వివాహం చేయబోతున్నాను! పుష్పమాల లెక్కడ?" అన్నాడు.

మణిభూషణుడు విమానంలో నుంచి నాలుగు పుష్పమాలలు తెచ్చి ఖడ్గ జీవదత్తులకూ, పద్మావతీ వసంతలకూ తలా ఒకటి యిచ్చాడు. పద్మావతీ, జీవదత్తులు ఒకరి మెడలో ఒకరు పూలమాలలు వేశారు. ఖడ్గవర్మా, వసంతకుమారీ కూడా అలాగే చేశారు. చుట్టూవున్నవాళ్ళ హర్షధ్వానాలతో ఆ ప్రదేశం మార్మోగిపోయింది.

యక్షరాజు, ఖడ్గ జీవదత్తుల్ని, వాళ్ళ భార్యలతో పాటు విమానంలో ఎక్కమని చెప్పి, వాళ్ళు విమానంలో ఎక్కి కూర్చోగానే, "ఖడ్గ జీవదత్తుల్లారా! మీ ఇచ్ఛామాత్రంతో యీ విమానం మీరు కోరిన ప్రదేశానికి వాయువేగంతో ప్రయాణిస్తుంది. ఈనాటి నుంచి నెలరోజులపాటు దీన్ని మీరు యథేచ్ఛగా ఉపయోగించుకోవచ్చు. ఆ తరవాత నా విమానం నా దగ్గరకు తిరిగి వస్తుంది! శుభం, వెళ్ళిరండి!" అన్నాడు.

"మీ దయకు ఎంతో కృతజ్ఞులం, యక్షరాజా!" అని ఖడ్గ జీవదత్తులూ, పద్మావతీ వసంతలూ యక్షరాజుకు నమస్కరించారు. విమానం రివ్వుమంటూ పైకి లేచి పద్మ వీరపురాల కేసి బయలుదేరింది.

—(అయిపోయింది.)






# విడిపోయిన మిత్రులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు ఏ స్నేహితుడి కొరకైనా ఇలా శ్రమ పడుతున్నావేమో? స్నేహం నిలవదు. ఇందుకు నిదర్శనంగా నీకు విడిపోయిన మిత్రుల కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం ఒక గ్రామంలో శంకరుడూ, కేశవుడూ అని ఇద్దరు ప్రాణమిత్రులుండే వారు. వారు ఏమంత కలిగిన వాళ్ళు కారు. వారికి యుక్తవయసు వచ్చి, కుటుంబభారం మీద పడేసరికి జీవితం కష్టసాధ్యమయింది. అందుచేత, ఇద్దరూ కూడబలుక్కుని, తమకు ఉన్నదంతా

## బేతాళ కథలు



అమ్మేసి, ఆ డబ్బుతో దేశాల మీద పడి వర్తకం చేయనిశ్చయించారు.

వర్తకం వారికి బాగా కలిసి వచ్చింది. వారు ఒక చోట స్థిరపడి పెద్ద ఎత్తున సముద్ర వ్యాపారం సాగించారు. శంకరుడికి ఒక కొడుకూ, కేశవుడికి ఒక కూతురూ ఉన్నారు. తమ ఇద్దరి మధ్యగల స్నేహాన్ని పురస్కరించుకుని శంకరుడు తన కొడుక్కు కేశవుడి కూతుర్ని చేసుకుంటానన్నాడు. అందుకు కేశవుడు సంతోషంగా ఒప్పుకున్నాడు.

పిల్లలిద్దరూ యుక్తవయసు వచ్చిన వాళ్ళు కావటం చేత, వెంటనే ముహూర్తం పెట్టుకుందామని స్నేహితులు అనుకుంటూ ఉండగా శంకరుడికి ఒక దుర్వార్త తెలిసింది. అతని ఓడలన్నీ సముద్రంలో మునిగిపోయాయి.

ఈ వార్త విని శంకరుడు హతాశుడయి పోయాడు. అతని బాకీదార్లు తమ బాకీల కింద అతనికి ఉన్నదంతా కాజేసి, అతన్ని నిరుపేదగా వదిలేశారు. శంకరుడు అప్పటి దాకా ఘనంగా బతికిన ఊళ్ళో ఉండలేక, తన మూటా ముల్లే సర్దుకుని భార్యనూ, కొడుకునూ వెంట బెట్టుకుని ఊరు విడిచి పోవటానికి సిద్ధమయాడు.

అది చూసి కేశవుడు, ''బావా! మన పిల్లలకు పెళ్ళి చేద్దామనుకున్నాం గదా. అనుకున్నట్టు జరగవద్దా?'' అన్నాడు.

దానికి శంకరుడు, ''నేనిప్పుడు నిరుపేదను. నీ తాహతుకు తగిన సంబంధం చూసి, నీ కూతురి పెళ్ళి చెయ్యి.'' అన్నాడు.

''నీ సంపదపోతే, నా సంపద ఉన్నది గదా? దైవికంగా జరిగే దుస్సంఘటినలకు ఎవరు బాధ్యులు? మనం సంపన్నులంగా పుట్టామా? నా ఆస్తిని మన పిల్లలిద్దరూ అనుభవిస్తూ ఉంటే మనం చూసి ఆనందింతాం.'' అన్నాడు కేశవుడు.

శంకరుడు ఈ ఏర్పాటుకు ఒప్పుకోలేదు. కేశవుడు ఎంత చెప్పినా ప్రయోజనం లేకపోయింది.

శంకరుడు దక్షిణదేశంలోని ముత్యాల నగరం చేరుకుని, ఒక రత్నవర్తకుడి దగ్గిర తన కొడుకుతో సహా పనికి కుదిరాడు. అతనికి ఉన్న అనుభవమూ, మంచితనమూ బాగా రాణించాయి. ఆర్థికంగా కొంత పుంజుకున్న తరవాత చిన్న ఎత్తున సొంత వ్యాపారం ప్రారంభించాడు. తండ్రి కొడుకులు చాలా శ్రమపడి వ్యాపారాన్ని వృద్ధిచేశారు.

శంకరుడు తన కొడుక్కు తగిన కన్యను చూసి పెళ్ళి చేసి, కొద్ది కాలంలో మనమరాలిని కూడా చూశాడు. ఆ పిల్లకు మాలతి అని పేరు పెట్టారు. మాలతి పుట్టిన తరవాత వ్యాపారం మరింతగా అభివృద్ధిచెంది శంకరుడికి బాగా సిరి ఎత్తుకున్నది. త్వరలోనే అతను పూర్వం అంత ధనవంతుడు అయాడు. శంకరుడు వెళ్ళిపోయాక కేశవుడు తన కుమార్తెను మరొక వ్యాపారస్థుడి కొడుకు కిచ్చి పెళ్ళి చేశాడు. ఆ పిల్లకు ఒక కొడుకు పుట్టాడు. వాడికి వసంతుడు అని పేరు పెట్టారు.

వసంతుడు యుక్తవయస్కుడై ఉండగా ఒకసారి కేశవుడితో అతని వియ్యంకుడు, "బావగారూ, అరబ్బు దేశాలలో మన సరుకుకు మంచి గిరాకీ ఉన్నదట. అక్కడ దొరికే ఖర్జూరానికీ, శిలాజిత్తుకూ ఇక్కడ గిరాకీ కద! ఒకసారి వెళ్ళివద్దామా? అదృష్టం బాగుంటే కోటీశ్వరులం అయిపోవచ్చు," అన్నాడు.





కేశవుడు సరేనన్నాడు. ప్రయాణానికి కావలసిన ఒంటెలను సమకూర్చుకుని, ఎడారి అవతల గిరాకీ ఉండే సరుకులు కొని, ఒంటెల మీద ఎక్కించి, వియ్యంకులిద్దరూ తమ కుటుంబాలనూ, పరివారాలనూ వెంటబెట్టుకుని ప్రయాణమయారు.

ఎడారి ప్రయాణం కొన్ని రోజుల పాటు బాగానే సాగింది. కాని ఒక రాత్రి అందరూ ఆదమరిచి నిద్రపోతూన్న సమయంలో దొంగలు వచ్చిపడి, మేలుకున్న వారి నందరినీ చంపి, సరుకుతో సహా ఒంటెల నన్నిటినీ తోలుకు పోయారు. ఆ దొంగల దాడిలో కేశవుడి మనమడు వసంతుడు తప్ప అందరూ పోయారు. కేశవుడి కుటుంబమూ, అతని వియ్యంకుడి కుటుంబమూ దొంగల కత్తులకు బలి అయింది. పరివారంలో కొద్ది మంది గాయాలు తగిలినా, చావకుండా మిగిలారు.

ఇలా చావగా మిగిలిన వాళ్ళు ఆకలి దప్పులతో అలమటించుతూ ఎలాగో ఎడారి నుంచి బయటపడ్డారు. వసంతుడికి తన దేశానికి తిరిగిపోబుద్ధి పుట్టలేదు. అక్కడ అతనికి ఎవరూ లేరు. అతను దొరికిన చోట తింటూ, నిద్రవచ్చినచోట పడుకుంటూ దేశాల వెంట తిరగసాగాడు.

కొన్ని సంవత్సరాలు అలా తిరిగి వసంతుడు ముత్యాల నగరం చేరాడు. అతను శంకరుడి దుకాణం ముందుకే వచ్చి, "అయ్యా, ఏ దన్నా పని ఇప్పిస్తారా?" అని అడిగాడు.

చిక్కిశల్యమై ఉన్న ఆ కుర్రవాణ్ణి చూసి శంకరుడు జాలిపడి, దగ్గిరికి పిలిచాడు. పరీక్షగా చూస్తే ఆ కుర్రవాడిలో తన బాల్య మిత్రుడైన కేశవుడి పోలికలు కనిపించాయి.

"నాయనా, నీది ఏ దేశం? నీ తండ్రి ఎవరు? తాత ఎవరు?" అని శంకరుడు ఆదరపూర్వకంగా వసంతుణ్ణి అడిగాడు.

వసంతుడు తన కథ అంతా చెప్పాడు.

శంకరుడు విధివిలాసానికి ఆశ్చర్యపడుతూ, "నాయనా, నీ తాత నాకు

ప్రాణస్నేహితుడు. నువు నా దగ్గిరే ఉండిపో, నీకు వ్యాపారం నేర్పుతాను," అన్నాడు.

వసంతుడు తెలివైనవాడు, చురుకైనవాడు. ఆ కుర్రవాణ్ణి చూసి శంకరుడు ముచ్చట పడ్డాడు. తనకూ, కేశవుడికీ ఉండిన మైత్రిని మరింత దృఢం చేసుకునేటందుకు ఆయన వసంతుడికి తన మనమరాలు మాలతిని ఇచ్చి వైభవంగా వివాహం చేశాడు. వాళ్ళు సుఖంగా ఉన్నారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, వసంతుడు దిక్కులేని పక్షిగా ఉన్నప్పటికీ తన మనమరాలినిచ్చి పెళ్ళిచేసి, తనకూ కేశవుడికీ ఉండిన పాతస్నేహాన్ని దృఢం చేసుకున్న శంకరుడు, అదే స్నేహాన్ని పాటించి, అదే పరిస్థితిలో తాను ఉన్నప్పుడు తన కొడుక్కు కేశవుడి కుమార్తెను చేసుకోవటానికి ఎందుకు నిరాకరించాడు? ప్రాణస్నేహితుడి నుంచి ఎందుకు విడిపోయాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శంకరుడు ఎప్పుడూ కేశవుడి పట్ల స్నేహభావం కలవాడే. అయితే అతను అభిమానవంతుడు. అందుచేత అతను, కేశవుడు తన పట్ల చూపిన ఆదరాన్ని భరించలేక పోయాడు. అలాటి వాడు కృతజ్ఞతా భారాన్ని మోయలేడు. సర్వస్వమూ పోగొట్టుకున్నది కేశవుడే అయి ఉన్నట్టయితే అతని కుమార్తెను శంకరుడు తప్పక చేసుకుని ఉండేవాడు. అలా జరగలేదు. కాని ఆ పరిస్థితి కేశవుడి మనవడికి సంప్రాప్త మయింది. శంకరుడు ఆ కుర్రవాడికి తన మనమరాలిని ఇచ్చి పెళ్ళిచేసేశాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

—(కల్పితం)



# ఎవరు మూఢులు

ఒక ఊళ్ళో ఇద్దరు మిత్రులుండే వాళ్ళు. వారిద్దరూ ఒకసారి కలుసుకుని మాటల సందర్భంలో తమ నౌకర్లు మూఢులని ఒకరితో ఒకరు చెప్పుకున్నారు. ఆ ఇద్దరి నౌకర్లలోనూ ఎవడు పెద్ద మూఢుడో తెల్సుకోవాలనుకుని, వాళ్ళు తమ నౌకర్లను పిలిపించారు.

ఒక అతను తన నౌకరు చేతిలో ఒక కానీ పెట్టి, "ఒరే, నువు వెంటనే అంగడికి పోయి ఒక వజ్రాలహారం కొనుక్కురా!" అన్నాడు. "ఇదుగో, ఇప్పుడే వస్తా," అని నౌకరు కానీ తీసుకుని బయలుదేరాడు.

రెండో అతను తన నౌకరుతో, "ఒరే, నువు ఉద్యానవనానికి వెళ్ళి, నేను అక్కడ ఉన్నానో లేదో చూసి వెంటనే రా!" అన్నాడు. నౌకరు సరేనని తాను కూడా బయలుదేరాడు.

తమ నౌకర్ల మూఢత్వానికి మిత్రులిద్దరూ నవ్వుకున్నారు.

ఈ లోపల నౌకర్లిద్దరూ దారిలో కలిసి మాట్లాడుకున్నారు.

"మా యజమాని మూర్ఖుడు కాకపోతే నన్ను వజ్రాలహారం తెమ్మంటాడా? ఇవాళ ఆదివారం గదా, అంగళ్ళు ఉంటాయా?" అన్నాడు ఒక నౌకరు.

"మా యజమాని తక్కువ తిన్నవాడా? ఆయన ఉద్యానంలో ఉన్నదీ లేనిదీ తోటమాలిని పిలిచి అడిగితే సరిపోయే దానికి నన్ను పంపాడే!" అన్నాడు రెండో నౌకరు.





చాలా కాలం క్రితం ఒక అరణ్యం సమీపంలో ఇద్దరు కట్టెలు కొట్టేవాళ్ళు ఉండేవాళ్ళు. రోజూ వాళ్ళు అరణ్యంలో కట్టెలు కొట్టుకునే వాళ్ళు. అలాగే వాళ్ళు ఒక రోజున అరణ్యంలో ఎంతసేపు తిరిగినా, వాళ్ళకు కట్టెలకు పనికి వచ్చే చెట్టు దొరకలేదు. చివరకు వాళ్ళు ఇంటి దారి పట్టి నడిచివస్తూండగా ఒకడికి ఆశ్చర్యకరంగా మంచిగంధం చెట్టు కనిపించింది.

"చూడు, చూడు! మంచి గంధం చెట్టు!" అన్నాడు వాడు రెండో వాడితో.

"అవునురా, బాబూ, నిద్రలేవబోతూండగా నాకు ఈ చెట్టే కలలో కనిపించింది," అన్నాడు రెండో వాడు, దురాశతో.

"కనిపిస్తే?" అన్నాడు మొదటి వాడు అనుమానంగా.

"దేవుడు అందుకే నన్ను ఇటుగా నడిపించాడు. ఆ చెట్టు నాది!" అన్నాడు రెండో వాడు.

"దాన్ని నీకు చూపింది నేనే గదా! నేను చూపక పోతే ఆ చెట్టు ఉన్నదన్న సంగతి కూడా నీకు తెలిసేది కాదు. అందు చేత అది న్యాయంగా నాదే. అయితే, నేను దురాశ గల వాణ్ణి కాను. నీకు అన్యాయం చెయ్యను. నువు కూడా నా వెంట ఉన్నావు గనక, మన మిద్దరమూ చెట్టును చెరి సగమూ పంచుకుందాం. అది ధర్మంగా వుంటుంది," అన్నాడు మొదటి వాడు.

ఈ మాటకు రెండో వాడు మండిపడి, "దేవుడి మాటనే కాదంటావా? కలలో ఈ చెట్టును దేవుడే నాకు చూపాడు. తిరిగి దేవుడే నాకు దీన్ని కళ్ళపడేశాడు. ఇంత అయాక నువు అందులో సగం

ఆర్. కృష్ణావతారం

వాటా అడుగుతున్నావా? అదేమీ కుదరదు. వల్ల కాదు. కావాలంటే నీకు రెండు కొమ్మలిస్తాను. తృప్తిపడు. కాదన్నావో, దేవుడి అనుమతితో నేను నీ బుర్ర పగల గొట్టేస్తాను," అన్నాడు.

మొదటి వాడు పాపభీతి కలవాడు. రెండోవాడు చెప్పినదంతా నిజమే అనుకుని, "నీ యిష్టం వచ్చినట్టే చెయ్యి." అన్నాడు. రెండోవాడు ఇచ్చిన రెండు కొమ్మలతో వాడు తృప్తిపడ్డాడు.

రెండోవాడు తన తెలివితేటలకూ, సమయస్ఫూర్తికీ తానే పరమానందం చెంది, మిగిలిన మంచిగంధంచెట్టు అంతా తానే కొట్టుకుని తన ఇంటికి చేర్చాడు.

మొదటి వాడు జరిగిన దాన్ని గురించి ఆలోచిస్తూ, పరధ్యానంలో దారి తప్పి, అరణ్యంలో చిక్కుకుపోయాడు. చీకటి పడి, వెన్నెల వచ్చింది. అరణ్యమంతా చెడతిరిగి అలసిపోయి, వాడు ఒక రాతి మీద కూర్చొని, కునికిపాట్లు పడుతూ విశ్రాంతి తీసుకోసాగాడు.

అంతలో వాడికి, "ఎవరర్రా? దాహం!" అన్న మూలుగు మాటలు వినిపించాయి. వాడు తల ఎత్తి చూసే సరికి, ఎదురుగా చెట్ల మధ్య వెన్నెలలో ఒక గుడిసె కనబడింది. అందులో ఎవరో ఉన్నట్టున్నారు. వాడు త్వరగా అక్కడికి వెళ్ళి చూసే సరికి, చావటానికి సిద్ధంగా ఉన్న ఒక వృద్ధురాలు కనబ



డింది. ఒక కుండలో నుంచి నీరు తీసి, వాడు ఆమె చేత తాగించాడు. వృద్ధురాలు తృప్తిపడి, కట్టెలు కొట్టే వాణ్ణి దీవించి, ''నాయనా, నేను చావబోతున్నాను. నాకు ఒక గాఢమైన కోరిక ఏమంటే, నా శరీరాన్ని మంచిగంధం చెక్కలతో తగలబెట్టాలని. అలా జరిగితే నా ఆత్మ సంతోషిస్తుంది,'' అన్నది.

''అమ్మా, నేను నిరుపేదను. నా దగ్గిర రెండు మంచి గంధపు కొమ్మలున్నాయి. వాటిని నీ చితిలో పెడతాను,'' అన్నాడు మొదటివాడు.

''నువు చాలా యోగ్యుడివి, నాయనా. ఆ పని చెయ్యి, చాలు. అన్నట్టు, నా పక్క కింద నేల తవ్వావంటే, నీకు డబ్బు దొరుకుతుంది. అదంతా నువే తీసుకో. అయితే, అందులో ఒక వంతు నువు ఉంచుకుని, తొమ్మిది వంతులు పేదసాదలకు పంచావంటే నీకు ఎంతయినా పుణ్యం వస్తుంది. నువు చచ్చి స్వర్గానికి పోతావు,'' అని వృద్ధురాలు ప్రాణం వదిలింది.

రెండో కట్టెలు కొట్టేవాడు తన మంచి గంధపుకర్ర అంతా అమ్మి ధనవంతుడై, మంచి ఇల్లు కట్టుకుని, పొలాలు కొని, మొదటి వాణ్ణి పలకరించటమే మానేశాడు.

మొదటివాడు ముసలిదాని డబ్బులో తొమ్మిది వంతులు పేదసాదలకు పంచి, మిగిలిన దానిలో కొంత పెట్టి ఇల్లు



మరమ్మతు చేయించుకుని, మిగతాది అవసరానికి దాచుకున్నాడు. వాడు సజ్జనుడు కావటం చేత అందరూ వాణ్ణి ఆదరించి, తమ కష్ట సుఖాలన్నీ వాడితో చెప్పుకునేవారు.

అందరూ వాణ్ణి మెచ్చుకోవటం చూసి రెండో వాడికి అసూయ కలిగింది. వాడు ఒకనాడు తన భార్యతో, "వాడికి మంచి శాస్తి చెయ్యటం ఎలాగో తెలియటం లేదు," అన్నాడు.

"వాడికి ఎక్కడో నిధి దొరికిందనుకుంటాను. అందులో నుంచి రోజూ కొంత తీసుకుని, తన సంచీలో పెట్టుకుని వస్తూ ఉంటాడు," అన్నది రెండో వాడి భార్య.

"అంతే కావాలి," అన్నాడు రెండో వాడు.

ఒకనాడు వాడు మొదటివాణ్ణి రహస్యంగా అరణ్యానికి వెంబడించి వెళ్ళాడు. అక్కడ వాడికి మొదటివాడు ఒక పడిపోయిన మాను మీద కూర్చుని కనిపించాడు. అక్కడే నిధి ఉండి ఉంటుందని రెండోవాడికి తోచింది.

వాడు మొదటివాడి వద్దకు వెళ్ళి, "నిధి ఎక్కడ ఉన్నది, చెప్పు!" అని అడిగాడు.

"నిధా? ఏం నిధి?" అని మొదటివాడు ఆశ్చర్యంగా అడిగాడు.

దొంగ దొరికిపోయి అబద్ధం ఆడుతున్నాడని రెండోవాడికి తోచింది. వాడు కూర్చుని ఉన్న మాను కిందనే నిధి ఉండి ఉంటుందని కూడా వాడికి నమ్మకం కలిగింది. కోపంతో వాడు మొదటివాడి గొడ్డలి లాక్కుని, వాడి తల పగలగొట్టాడు.

"ఎల్ల కాలమూ వెతికినా నీకా నిధి దొరకదు," అంటూ మొదటి వాడు ప్రాణాలు వదిలాడు.

మరు క్షణమే రెండోవాడు వడ్రంగి పిట్టగా మారిపోయాడు. వడ్రంగిపిట్టలు ఆ నిధి కోసమే కనపడిన మానులన్నిటినీ ముక్కుతో కొట్టుతూ ఉంటాయి.



# చమత్కారి

ఒక రాజుకు ఒకనాటి రాత్రి అతి విచిత్రమైన కల వచ్చింది. దాన్ని మర్నాడు అందరికీ చెప్పి, ఆశ్చర్యపరుద్దామనుకున్నాడు రాజు. కాని తెల్లవారి నిద్రలేచినాక ఆయనకు తను కలలో చూసిన వింతలు జ్ఞాపకం రాకుండా పోయాయి.

రాజు ఇందుకు నిరాశచెంది, తన నగరంలోని జ్యోతిష్కుల నందరినీ రాజభవనానికి పిలిపించి, "నిన్న రాత్రి నాకు అతి విచిత్రమైన కల ఒకటి వచ్చింది. కాని తెల్లవారి లేచి దాన్ని పూర్తిగా మరిచిపోయాను. ఆ కల ఏమిటో మీ రెవరైనా చెప్పినట్టయితే ధనరూపంలో గొప్ప బహుమానం ఇస్తాను," అన్నాడు.

ఈ మాటవిని జ్యోతిష్కులు తెల్లముఖాలు వేసి, "మహారాజా, జ్యోతిషంలో అలా కలలను వివరించే సూత్రాలు ఏవీ లేవు," అన్నారు.

కాని వారిలో ఒకడు, "మహారాజా, మీరు నా ప్రశ్నకు సమాధానం చెప్పినట్టయితే నేను మీకు వచ్చిన కల ఏమిటో చెప్పగలను," అన్నాడు.

"నీ ప్రశ్న ఏమిటి?" అని రాజు అడిగాడు.

"మీ రిచ్చే బహుమానాన్ని నేను ఏ విధంగా ఉపయోగించ బోతున్నానో సెల వియ్యండి," అన్నాడు ఆ చమత్కారి.

"అది నాకు ఎలా తెలుస్తుంది?" అన్నాడు రాజు ఆశ్చర్యంతో.

"మేలుకుని ఉన్నవాడి ఆలోచనలే ఇతరులు చెప్పలేనప్పుడు, ఇతరుల కలలు ఎలా తెలుస్తాయి, మహారాజా?" అన్నాడు చమత్కారి.

రాజు ఆ చమత్కారికి బహుమానం ఇచ్చి పంపేశాడు. — బి. బాలసుబ్రహ్మణ్యం





# రాజుగారి బావమరిది

ఒకానొకప్పుడు మహాసేనుడనే రాజు భారతదేశం అంతా జయించి చక్రవర్తి అయాడు. మహాసేనుడికి ఓడిన రాజులందరూ అతనికి సామంతులై, అతని నిర్ణయాలనుబట్టి పరిపాలించసాగారు.

సామ్రాజ్యం స్థాపించటానికి ఎన్నో యుద్ధాలు చేసినప్పటికీ మహాసేనుడు ప్రజాకంటకుడు కాడు. పైగా, ప్రజాక్షేమం గురించి ఆయన చాలా శ్రద్ధగా ఆలోచించేవాడు; అందుకొరకు అనేక ప్రణాళికలు వేసి, సామ్రాజ్య మంతటా అమలు జరిపించేవాడు. అందుచేత మహాసేనుడి సామ్రాజ్యంలో అన్ని దేశాలూ సుభిక్షంగా ఉండేవి. ఒక్క కోసలదేశం మటుకు ఈ విషయంలో వేరుగా ఉంటూ వచ్చింది.

తన ప్రణాళికలు అన్ని ప్రాంతాలా మంచి ఫలితాలను ఇస్తున్నప్పుడు ఒక్క కోసలలో అవి ఎందుకు నిరుపయోగం అవుతున్నాయో మహాసేనుడికి అంతుబట్ట లేదు. ఈ విషయమై ఎంత సమాచారం సేకరించినప్పటికీ ప్రయోజనం లేక పోయింది.

చక్రవర్తికి రాజపురోహితుడుండేవాడు. ఆయనకు దగ్గిర బంధువు గుణనిధి అనే అమాయకుడు ఒకడు ఉండేవాడు. గుణనిధి సంభాషణ అందరికీ నవ్వు పుట్టించేదిగా ఉండేది. మహాసేన చక్రవర్తి కూడా తన మనసుకు విశ్రాంతి కావలసినప్పుడు గుణనిధిని పిలిపించి, అతన్ని వాగించి, అతని అమాయిక సంభాషణ విని ఆనందించేవాడు.

గుణనిధికి దైవభక్తి హెచ్చు. భారతదేశంలో ఉండే అందరు దేవుళ్ళ దర్శనమూ చేసుకుని, బోలెడంత పుణ్యం సంపాదించాలని అతని ఆశ. కోసల

"వసుంధర"

దేశంలో ఊరికొక దేవత ఉన్నదనీ, గుడి లేని గ్రామం లేదనీ, చివరకు కీకారణ్య ప్రాంతాలలో కూడా అతి ప్రాచీన పవిత్ర దేవాలయాలు ఉన్నాయనీ విని గుణనిధి ఆ దేశంలో యాత్రలు చేయాలని బయలుదేరాడు.

గుణనిధి ప్రయాణం సుఖంగానూ, శీఘ్రంగానూ సాగగలందులకు రాజపురోహితుడు అతనికి ఒక రథాన్నీ, సారథినీ ఏర్పాటు చేశాడు. కోసల సరిహద్దులో ప్రవేశిస్తూనే గుణనిధి రామపురి అనే గ్రామం చేరాడు. అక్కడ ఈశ్వరుడు నటరాజు రూపంలో వెలిశాడుట. ప్రజలు నటరాజుకు ఒక అందమైన దేవాలయం నిర్మించారు. గుణనిధి ఆ ఆలయాన్ని చూడగానే పులకించి, మందిరం లోపల దేవుని మూర్తిని చూసి పరవశించిపోయి, "హరహర మహాదేవా!" అంటూ గట్టిగా అరిచాడు.

మరుక్షణమే ఇద్దరు భటులు ఎక్కడి నుంచో ఊడిపడి, ఆయనను పట్టుకున్నారు.

గుణనిధి ఆశ్చర్యపోయి, "ఇదేమిటి?" అని అడిగాడు.

"గర్భగుడిలో శబ్దం చెయ్యటం నేరం. గ్రామాధికారి దగ్గిరికి పద," అన్నారు భటులు.



తనకు ఆ సంగతి తెలియదనీ, మొదటి తప్పుగా ఎంచి వదలి పెట్టమనీ గుణనిధి ఎంతో వేడుకున్నాడు. కాని భటులు అతడి మాటలేవీ వినిపించుకోక, గ్రామాధికారి వద్దకు రమ్మని తొందర పెట్టారు. విధిలేక, గుణనిధి వాళ్ల వెంట పోవటానికి సిద్ధపడ్డాడు.

దేవాలయంలోనే ఉండి ఇదంతా చూస్తున్న ఒక యువకుడు నెమ్మదిగా గుణనిధిని సమీపించి, "ఎందుకయ్యా బ్రాహ్మడా, వీళ్ళతో గొడవ? ఇద్దరికీ చెరొక రూకా పారేస్తే నీకే బాధా ఉండదు," అని రహస్యంగా చెవిలో చెప్పాడు.



వెంటనే గుణనిధి ఆ భటులకు చేరి ఒక వెండి రూకా ఇచ్చుకున్నాడు. వాళ్ళు వెళ్ళిపోయారు. తరవాత గుణనిధి ఆ యువకుడికి తన కృతజ్ఞత చెప్పుకుని, "గర్భగుడిలో దేవుడి పేరు ఉచ్చరించటం నేర మెలా అయిందీ?'' అని అడిగాడు.

ఆ యువకుడు నవ్వి, ''ఈ దేశంలో ఇది తప్పు, ఇది ఒప్పు అని నియమం ఏమీ లేదు. ఎప్పుడు ఏది నేరం అవుతుందో, ఈ ఊరి వాళ్లం మాకే తెలియదు. మాకు తెలిసినది ఏమిటంటే, రాజభటులు మా మీద నేరం ఆరోపించి పట్టుకున్నప్పుడు వాళ్లకు లంచం ఇచ్చి వదిలించుకోవటం. గ్రామాధికారి దాకా పోతే, అతడికి ఇంకా పెద్ద లంచం ఇచ్చుకోవలిసి వస్తుంది,'' అన్నాడు.

గుణనిధి తెల్లబోయి, ''గ్రామాధికారి కూడా లంచం పుచ్చుకుంటాడా? అలాటప్పుడు మీ రాజుగారికి ఫిర్యాదు చేసుకోవచ్చునే?'' అన్నాడు.

''ఏమి ఫిర్యాదు చేస్తాం? ఆయన రాజుగారి బావమరిది!'' అన్నాడు ఆ యువకుడు.

గుణనిధి తాను రాజపురోహితుడి బంధువునని చెప్పిన మీదట ఆ యువకుడు, ''మీరు ఈ సంగతి గ్రామాధికారికి చెప్పుకుంటే, ఇక మీదట మీకు ఏ ఇబ్బందీ ఉండదు,'' అని చెప్పాడు.

గుణనిధి అలాగే చేశాడు. అతనికి ఆ గ్రామంలో మరి ఎలాటి ఇబ్బందీ కలగలేదు. అంతా సుఖంగా జరిగిపోయింది. మిగతా గ్రామాలలో కూడా అతను అలాగే చేసి తన తీర్థయాత్రలు నిర్విఘ్నంగా కొనసాగించుకున్నాడు. అయితే తాను చూసిన ప్రతి గ్రామంలోనూ, రామపురిలో లాగే, రాజభటులు ప్రజలను అయిన దానికీ, కాని దానికీ భయపెట్టుతూ ఉండటమూ, లంచాలు పుచ్చుకుంటూ ఉండటమూ, అందులో కొంత భాగం తమ పై అధికారులకు వాటా పెట్టుతూ ఉండటమూ కనబడింది.

ఆ అధికారుల మీద ఫిర్యాదు చెయ్యట మంటే ప్రజలకు భయం. ఎందుకంటే, వాళ్ళు అందరూ రాజుగారి బావమరదులే!

ప్రతి ఊళ్ళోనూ జనం, "మా గ్రామాధికారి రాజుగారి బావమరిది అయిపోయాడు! మేమేం చెయ్యగలం?" అనటం గుణనిధి విన్నాడు.

గుణనిధి తీర్థయాత్రలు ముగించుకుని తిరిగి వచ్చినట్టు తెలిసి, మహాసేనుడు అతన్ని పిలిపించి, యాత్రా విశేషాలు అడిగాడు. గుణనిధి విశేషాలన్నీ ఒక్కటొక్కటే చెప్పి, "రసికత్వంలో శ్రీకృష్ణుడి తరవాత ఈ కోసలరాజునే చెప్పుకోవాలి. ఆయనకు ఎంతమంది బావమరుదులు ఉన్నారో చెప్పలేం!" అన్నాడు.

మహాసేనుడు నవ్వు ఆపుకుంటూ, "లెక్కపెట్టలేకపోయారా?" అన్నాడు.

"ఎలా లెక్కపెట్టేది, ప్రభూ? ప్రతి గ్రామాధికారీ రాజుగారి బావమరిదే. రాజ్యానికి సంబంధించిన వ్యవహారాలు చూసేవారంతా రాజుగారి బావమరుదులే," అన్నాడు గుణనిధి.

ఈసారి మహాసేనుడికి నవ్వురాలేదు. ఆయన గుణనిధిని ప్రశ్నించి, అతను తనకు చెప్పిన మాట కోసలప్రజల నోట విన్నదేనని స్పష్టం చేసుకున్నాడు. ఆయనకు ఇందులో ఏదో రహస్యం ఉంటుందని తోచింది. మహాసేనుడికి తెలిసినంత వరకు కోసలరాజుకు ఇద్దరే భార్యలు. వారిలో ఒకతె మహాసేనుడి సొంత చెల్లెలు. అలా అయినప్పుడు కోసలరాజు వ్యవహారాలన్నీ అతని బావమరుదులు ఎలా నిర్వహిస్తున్నారు? కోసలరాజు రెండో భార్యకు ఇన్ని వేలమంది సోదరులుండటం అసంభవం.



గుణనిధిని పంపేసి, మహాసేనుడు ఆలోచనలో పడ్డాడు. తాను తయారు చేసిన ప్రణాళికలు చాలా యోగ్యమయినవి అని సంతోషించాడేగాని, వాటిని అమలు జరిపే యోగ్యులను గురించి తాను ఆలోచించలేదు. తన ప్రణాళికలు

ఒక్క కోసలలో మాత్రమే సత్ఫలితాలు ఇవ్వకపోవటానికి అధికారులలో ఏదో లోపం ఉండటమే కావచ్చునని ఇప్పుడాయనకు తోచింది. వెంటనే నమ్మకస్తులైన ఇద్దరు చారులను ఆయన కోసల దేశానికి పంపాడు. వాళ్ళు చక్రవర్తికి కావలసిన సమాచారం సేకరించారు.

గుణనిధి చెప్పినట్టుగానే, కోసల రాజ్యంలో ప్రజాపీడన విచ్చల విడిగా సాగుతున్నది. అధికారులు తమ అధికారాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. అందుకు కారణం అధికారుల నియామకం అర్హతలను బట్టి జరగకపోవటం. ఉదాహరణకు, కోసల రాజ్యంలో సైన్యాధిపతిగా ఉన్న శూరసింహుడు అనే వాడు ఎన్నడూ కత్తిపట్టి ఎరగడు. అతని పరాక్రమమంతా అతని పేరులో మాత్రమే ఉన్నది. అతను రాజుగారి బావమరిది! అందుకే కోసలదేశంలో అర్హతలేకుండా, ఇతర కారణాల వల్ల అధికారి అయిన ప్రతి ఒక్కడికీ 'రాజు గారి బావమరిది' అన్న మాట వాడుకలోకి వచ్చింది.

ఇదంతా విన్న మహాసేనుడికి కనువిప్పు కలిగింది. కోసలరాజు తనకు బావమరిది కావటం చేతనే కదా ఇంతకాలమూ కోసలదేశంలో తన ప్రణాళికలు విఫలం కావటానికి సరి అయిన కారణం విచారించక, కోసలరాజు చెప్పిన సాకులు నమ్మి ఊరుకున్నాడు? ఇలాటి గుడ్డి నమ్మకం ప్రజలకు ఎంత హాని చేస్తున్నదో ఇప్పుడు స్పష్టమయింది.

మహాసేనుడు తగిన చర్యలు తీసుకుని, కోసలలో అనర్హులైన అధికారులనందరినీ పదవుల నుంచి తొలిగించేశాడు. కొద్ది సంవత్సరాల కాలంలో కోసలదేశం సుభిక్షమయింది. తరవాత ఆయన ఆ దేశంలో సంచారం చేసినప్పుడు గ్రామాలలో ప్రజలు, "మా గ్రామాధికారి రాజుగారి బావమరిది కాదు లెండి! అందుకే అందరమూ చల్లగా ఉన్నాం." అన్నారు.





# మారిన హరినాథ్

మేఘనా నదీ తీరాన సురుపా అనే గ్రామం చాలా అందమైనది. ఆ గ్రామంలో జలసమృద్ధీ, ధాన్యసమృద్ధీ మాత్రమే గాక, పుష్పాలూ, ఫలాలూ కూడా ప్రఖ్యాతంగా ఉండేవి. గ్రామస్థులు కష్టించి పని చేసేవారు; పుణ్యాత్ములు.

గ్రామపెద్ద దీనానాథ్ అరవై ఏళ్ళవాడు. ఆయన తెలివి గలవాడూ, సజ్జనుడూనూ. ఆయన స్వార్థంతో ఏ పనీ చేసి ఎరగడు, గ్రామం మంచికోరే ప్రతిపనీ చేసేవాడు. అందుచేత గ్రామస్థులందరికీ ఆయన అంటే చాలా అభిమానం.

దీనానాధుకు చాలా కాలం పిల్లలు లేరు. యాభయ్యో పడిలో ఆయనకు ఒక పిల్లవాడు కలిగాడు. వాడికి హరినాథ్ అని పేరు పెట్టుకున్నారు.

హరినాథ్ వయసు పెరుగుతున్న కొద్దీ వాడి అకతాయితనం కూడా పెరిగింది. చదువు సంధ్యలలో వాడు చాలా చురుకైన వాడే. ఆరో ఏట వాణ్ణి గ్రామంలోని బడికి పంపితే, మొదటి నుంచీ వాడు తన తరగతిలో అందరికన్న ముందు ఉంటూ వచ్చాడు. ఒకటి, రెండు సార్లు విన్నది వాడు జ్ఞాపకం పెట్టుకో గలిగే వాడు. పుస్తకాలు కూడా ఏ మంత తిరగేసే వాడు కాడు.

కాని రకరకాల అల్లరి సృష్టించి ఆనందించటంలో వాడు ఘటికుడు. ఎవరి తోటలోనో జొరబడి గడ్డుకాయలు కోసి, కొమ్మలు విరిచేవాడు. ఎవరి గొడ్డునో విప్పి, ఊరికి దూరంగా తరిమి, గొడ్డుగల వాళ్ళను హైరాన పెట్టేవాడు. వాడు పక్షులను బతకనిచ్చేవాడు కాడు; వాటిని వడిసెల రాళ్ళతో కొట్టి చంపేవాడు; చెట్లమీదికి ఎక్కి పక్షి గూళ్ళు లాగేసి, గుడ్లు నేలపాలు చేసేవాడు.




గ్రామంలోని పెద్ద చెరువు వెంబడి ఉండే మామిడి తోటలో పసుపుపచ్చ చిలకల మందలుండేవి. పసుపుపచ్చ చిలకలు చాలా అరుదైనవి. హరినాథ్ దౌష్ట్యం మూలాన వాటికి వినాశం వచ్చి పడింది. వాటి సంఖ్య తరిగి పోసాగింది. పసుపుపచ్చ చిలకలను పట్టుకుని అమ్మి జీవించే వాళ్ళకు పెద్ద బెడద వచ్చింది.

ఒక నాడు హరినాథ్ పక్షిగూడు కోసం ఒక ఎత్తయిన తాటిచెట్టు ఎక్కాడు. వాడు పైకి చేరి, తాటిమట్టల మధ్య భద్రంగా కూర్చుని, గూడు కోసం చెయ్యి చాచేటప్పుడు పాము బుసకొట్టటం విని పించింది. వాడు చెయ్యి వెనక్కు తీస్తూండగానే తాచుపాము వాణ్ణి కాటు వేసింది. దాని విషం వెంటనే పని చేసే సరికి, హరినాథ్ స్పృహతప్పి, అంత ఎత్తు నుంచీ కింద పడిపోయాడు. అయితే దిగువన ఉన్నది బురదనేల కావటం చేత వాడి ఎముకలన్నీ నున్నం కాలేదు; పాదంలో ఒక ఎముక మాత్రం విరిగింది. గ్రామంలో విష చికిత్స చేసే వైద్యుడు జాప్యం జరగకుండా చికిత్స చెయ్యటం చేత కుర్రవాడికి ప్రాణభయం తప్పింది. చాలా కాలం తరవాత వాడి విరిగిన ఎముక మళ్ళీ కలుసుకున్నది.

అంతకు పూర్వం దీనానాథ్ తన కొడుకు అల్లరి మాన్పించటానికి ఎన్ని మార్గాలున్నాయో అన్నీ చేసి చూశాడు; హరినాథ్‌ను కొట్టాడు; తిట్టాడు, తిండి లేకుండా గదిలో బంధించాడు. కాని ఇవన్నీ నిష్ప్రయోజనమయాయి. ఈ సంఘటన జరిగాక తన కొడుకు ఆకతాయితనం కట్టుతుందని దీనానాథ్ ఆశపడ్డాడు. కాని అలా జరగలేదు. హరినాథ్ మిగిలిన అల్లరి అంతా మానే శాడు గాని పక్షిగుడ్ల కోసం చెట్లు ఎక్కటం మానలేదు.

ఒక నాడు హరినాథ్ పెత్తండ్రి సోమ నాథ్ వాణ్ణి, "ఇంత క్రూరంగా ఎందుకు తయారయావురా? పక్షులను చంపటంలో

నీకు సరదా ఏమిటి? వాటి ఉసురు తగలటం చేతే పాము నిన్ను కాటేసింది," అన్నాడు.

"లేదు, పెదనాన్నా, నేనిప్పుడు పక్షులను కొట్టటం లేదు. గుడ్లతో ఆడుకుంటాను, అంతే," అన్నాడు హరినాథ్.

"గుడ్లకు మాత్రం ప్రాణం లేదూ? నీ కాసంగతి తెలీదూ?" అన్నాడు సోమనాథ్.

"అన్నీ అబద్ధాలు, పెదనాన్నా. గుడ్లు గోలీల్లా గుంటాయి. పక్షులు వాటితో ఆడుకుంటాయి. మనం బాతుగుడ్లు తినటం లేదా? గుడ్లతో ఎందుకు ఆడుకో రాదూ? అవి ఆట వస్తువులే!" అన్నాడు హరినాథ్ నవ్వుతూ.

"నిజంరా! గుడ్లకు ప్రాణం ఉన్నది," అన్నాడు సోమనాథ్.

"లేదు, పెదనాన్నా. గుడ్లు కదులుతాయా? చప్పుడు చేస్తాయా? వాటిలో ప్రాణం ఉన్న లక్షణాలేవీ లేవు. గోలికాయల్లో ఎంత ప్రాణం ఉందో గుడ్లలోనూ అంతే ఉంది!" అన్నాడు హరినాథ్.

"సరే, గుడ్లకు ప్రాణం ఉన్నదని చూపిస్తే, వాటిని చితపటమూ, మిగిలిన అల్లరీ మానేస్తావా? మానేస్తానని మాట ఇయ్యాలి," అన్నాడు సోమనాథ్.

"అలాగే మానేస్తాను. కాని గుడ్డులో ప్రాణం ఉన్నట్టు నువు రుజువు చెయ్యాలి," అన్నాడు హరినాథ్.



"గుడ్డు దానంతట అదే కదులు తుందని ఇవాళ మధ్యాన్నం నీకు చూపిస్తాను. కాని, అల్లరి పనులు చెయ్యనని, సరదా కోసం గుడ్లు పగలగొట్టననీ నువు ప్రమాణం చెయ్యాలి. రేపటి నుంచీ నువు పూర్తిగా బుద్ధిమంతుడివై పోవాలి. ఇందుకు ఒప్పుకుంటావా?" అన్నాడు సోమనాథ్.

"ప్రమాణం చేస్తాను. కాని ముందు నాకు గుడ్డులో ప్రాణం ఉన్నట్టు చూపించు," అన్నాడు హరినాథ్.

ఇంద్రజాలం తెలిసిన సోమనాధుడికి గుడ్డును కదిలేటట్టు చెయ్యటం కష్టమేమీ కాదు. అయన ఒక పసుపుపచ్చ చిలుక గుడ్డు సంపాదించి, దాని చివర చిన్న బెజ్జం పెట్టి, లోపలి పదార్థమంతా తీసేసి, గుడ్డులోపల శుభ్రంగా కడిగి ఎండ బెట్టాడు. తరవాత ఆ గుడ్డులోకి జాగ్రత్తగా ఒక పురుగును ఎక్కించి, బెజ్జం మైనంతో పూడ్చేసి, లోపలి పురుగుకు ఊపిరి ఆడటానికి సన్నని రంధ్రం మాత్రం ఉంచి, దాన్ని తెచ్చి హరినాథ్‌కు చూపాడు.

పెత్తండ్రి పిలిచే సరికి హరినాథ్ వచ్చి ఒక కుర్చీ మీద కూర్చున్నాడు. పక్కనే ఉన్న బల్ల మీద సోమనాథ్ తాను తయారు చేసిన గుడ్డును వుంచాడు. ఒక్క నిమిషమైనా! గడవకుండానే గుడ్డు దొర్లసాగింది.

"చూశావా, హరినాథ్? గుడ్డు కదులుతున్నది! దానిలో ప్రాణం వున్నది," అన్నాడు సోమనాథ్.

హరినాథ్ తన కళ్ళతో చూసే దాన్ని కాదని ఎలా అనగలడు? తాను ఇక ఎన్నడూ గుడ్డుకు హాని చెయ్యనని వాడు తన పెత్తండ్రి ఎదట దేవుడి మీద ఒట్టు పెట్టుకున్నాడు.

ఆ తరవాత హరినాథ్ పూర్తిగా మారిపోయాడు. వాడు క్రమంగా గ్రామానికంతకూ ఆదర్శ బాలుడుగా తయారయాడు. గ్రామస్థులు వాణ్ణి చూసి గర్వపడ్డారు.



# ప్రగల్భాలు

ఒక అరణ్యం గుండా అయిదుగురు ప్రయాణిస్తున్నారు. ఒకడు పుట్టుగుడ్డి. ఒకడికి బ్రహ్మ చెవుడు. ఒకడు రెండుకాళ్ళూ లేని కుంటి. ఒకడు రెండు చేతులూ లేని అవిటి. అయిదో వాడు గోచిగుడ్డ తప్ప లేని నిష్ఠదరిద్రుడు.

అకస్మాత్తుగా చెవిటివాడు ఆలకించినట్టు నటించి, "దూరాన గుర్రపుడెక్కల చప్పుడవుతున్నది. బందిపోటు వస్తున్నట్టుంది," అన్నాడు.

వెంటనే గుడ్డివాడు, "అదుగో, దుమ్ము కూడా ఆకాశంలోకి లేస్తున్నది," అన్నాడు. గుడ్డివాడి భుజాల మీద ఉన్న కుంటివాడు, "అయితే, కాలి సత్తువ కొద్దీ పరిగెత్తుదాం పట్టండి," అన్నాడు.

"ఛీ, పారిపోవట మేమిట్రా? దొంగలతో బాహాబాహి పోట్లాడి వాళ్ళ అంతుతేలుద్దాం!" అన్నాడు అవిటివాడు.

ఇదంతా వింటున్న నిష్ఠదరిద్రుడు, "ఆ దొంగలు వచ్చి నన్ను నిలువుదోపిడీ చేసినదాకా మీరంతా ఇలాగే కబుర్లు చెబుతూ ఉంటారు," అన్నాడు.

—ఎస్. వీరభద్రస్వామి





గోపాలపురంలో శివశర్మ అనే యువకుడు ఉండేవాడు. వాడికి తల్లీ, తండ్రీ ఎవరూ లేరు. వాడి దగ్గిర తాతలకాలం నాటి వజ్రం ఒకటి ఉండేది. దాన్ని ఎక్కడైనా తాకట్టుపెట్టి కొంత డబ్బు తీసుకుని, దాంతో ఏదన్నా వ్యాపారం చేసుకుందామని శివశర్మ, వీరిశెట్టి అనే వాడి దగ్గిరికి వెళ్లి, అతని వద్ద ఆ వజ్రాన్ని తాకట్టుగా ఉంచి కొంత డబ్బు తీసుకున్నాడు.

తరవాత శివశర్మ ఆ డబ్బుతో దూరాన వున్న పట్టణానికి పోయి సరుకులు కొనుక్కొని వచ్చి, పక్క ఊరి సంతలో వ్యాపారం సాగించాడు.

వీరిశెట్టి వజ్రాల సంగతి కొంత తెలిసినవాడు. శివశర్మ తన వద్ద తాకట్టు ఉంచిన వజ్రాన్ని పరీక్షించి అది చాలా విలువైనదని రూఢి చేసుకుని, అతను దాన్ని తన భార్యకిచ్చి, భద్రంగా దాచమన్నాడు.

అది వెలగల వజ్రం అని తెలుసుకొని వీరిశెట్టి భార్య, ''నకిలీ వజ్రాల వర్తకుల దగ్గిర ఇలాటిదే ఒకటి కొని ఉంచి, బాకీ చెల్లించేటప్పుడు ఆ శివశర్మకు దాన్ని ఇస్తే ఇది మనకే ఉండిపోతుంది. ఆ పని చెయ్యండి,'' అన్నది.

అసలే దురాశాపరుడైన వీరిశెట్టికి ఈ ఆలోచన బాగానచ్చింది. అతను నకిలీ వజ్రాల వర్తకుల దగ్గిర అలాటి వజ్రాన్నే కొని తెచ్చాడు.

శివశర్మకు వ్యాపారంలో మంచి లాభం వచ్చింది. అతను డబ్బు తెచ్చి, వీరిశెట్టికి వడ్డీతోసహా చెల్లించాడు.

వీరిశెట్టి డబ్బు ఒకటికి రెండు సార్లు లెక్క చూసుకుని, నకిలీ వజ్రాన్ని శివశర్మకు ఇచ్చి పంపాడు.

అచంట సుధాకర్

శివశర్మ సంకోచించకుండా ఆ వజ్రాన్ని తన ఇంటికి తీసుకుపోయి, దాచిపెట్ట బోతూ పరీక్షగా చూస్తే, అతనికి ఈ వజ్రం తనది కాదేమోనని అనుమానం వచ్చింది. అప్పు డతను, వీరిశెట్టి యిచ్చిన ఆ నకిలీ వజ్రాన్ని న్యాయాధికారి వద్దకు తీసుకుపోయి, జరిగినదంతా చెప్పి, అది తన వజ్రంలాగా లేదన్నాడు.

న్యాయాధికారికి కూడా అది అసలు వజ్రం కాదేమో నని అనుమానం తగిలి, వజ్రాల వీరయ్య అనే నిపుణుణ్ణి పిలిపించి చూపిస్తే, అతను దాన్ని చేతిలో ఒక మారు అటూయిటూ తిప్పి చూసి, "వట్టి గాజు పెంకు," అన్నాడు.

వీరిశెట్టి మోసం చేశాడని న్యాయాధికారికి తెలిసిపోయింది. ఆయన అప్పటి కప్పుడే ఆలోచనచేసి, వీరిశెట్టి నుంచి అసలు వజ్రం రాబట్టటానికి ఒక పథకం వేసి, దాన్ని వజ్రనిపుణుడికీ, శివశర్మకూ చెప్పి పంపేశాడు.

శివశర్మ వీరిశెట్టి దగ్గిరికి వెళ్ళి, "ఈ వజ్రం నాది కాదు. నా వజ్రం నా కిప్పించు," అన్నాడు.

"నీ వజ్రమే నీ కిచ్చాను. నా దగ్గిర వజ్రాలేమన్నా పోసుకు కూర్చున్నానా, మార్చటానికి? నేనేం వజ్రాల వ్యాపారిని కాదు," అన్నాడు వీరిశెట్టి.




"అలా అయితే న్యాయాధికారి దగ్గిర తేల్చుకుందాం," అంటూ శివశర్మ వీరిశెట్టిని న్యాయాధికారి దగ్గిరికి తీసుకుపోయాడు.

న్యాయాధికారి శివశర్మ ఫిర్యాదును కొత్తగా వింటున్నట్టు నటించి, "మీరేమో అతని వజ్రం అతని కిచ్చానంటున్నారు. శివశర్మ ఇది నకిలీ వజ్రమనీ, తనది కాదనీ అంటున్నాడు. అందుచేత వజ్రాల నిపుణుణ్ణి పిలిపించి దీన్ని పరీక్ష చేయిస్తే నిజం తేలిపోతుంది," అని వీరిశెట్టితో అన్నాడు.

వజ్రాల నిపుణుడు చూస్తాడంటే వీరిశెట్టి భయపడి పోయాడు. నిజం

బయటపడిడే తాను ఏ బొంకు బొంకి తప్పించుకుంటే బాగుంటుందో అతను ఆలోచించసాగాడు.

ఇంతలో వజ్రాల నిపుణుడు వచ్చాడు. అతను న్యాయాధికారి యిచ్చిన వజ్రాన్ని చాలాసేపు పరీకించి, ఆశ్చర్యం కనబరుస్తూ, "ఇది నికరమైన వజ్రం. ఇలాటి వజ్రాలు, ఏ జమీందార్ల ఇళ్ళల్లోగాని వుండవు. చాలా ఖరీదైనది!'' అన్నాడు.

వీరిశెట్టి ఈ మాట విని అంతులేని ఆశ్చర్యం పొంది కూడా పైకి గంభీరంగా వున్నాడు.

న్యాయాధికారి శివశర్మతో, ''వీరిశెట్టి లాటి నిజాయితీ పరులమీద ఇలాటి ఫిర్యాదు చెయ్యటం చాలా తప్పు. నీ వజ్రం తీసుకుని నువు వెళ్ళవచ్చు." అని శ్రమ ఇచ్చినందుకు వీరిశెట్టికి క్షమాపణ కూడా ఇచ్చాడు.

వీరిశెట్టి తన ఇంటికి తిరిగివస్తూ, ''నకిలీ వజ్రాన్ని ఆ నిపుణుడు మంచి వజ్రమని ఎలా చెప్పాడు? కొంపతీసి అసలు వజ్రమే శివశర్మకు చేరిందా ఏం?" అని ఆందోళన పడ్డాడు.

అతను ఇంటికి వస్తూనే తన భార్యతో, ''కొంప మునిగిందేవ్! నిద్ర మొహం దానా, రెండు వజ్రాలనూ అటూ ఇటూ మార్చి, చివరకు అసలు వజ్రమే శివశర్మకు ఇచ్చినట్టున్నాం. నీ దగ్గర ఉన్న వజ్రం ఇలా పట్టుకురా!'' అన్నాడు.

ఈ మాట విని కంగారుపడి, వీరిశెట్టి భార్య దాచి ఉంచిన చోటునుంచి వజ్రాన్ని తెచ్చి భర్తకిస్తూ, కిటికీ గుండా లోపల జరుగుతున్న దంతా చూస్తున్న గ్రామాధికారినీ, శివశర్మనూ చూసి కొయ్యబారిపోయింది.

గ్రామాధికారి తలుపు తీయమని చెప్పి, ''అసలు వజ్రం బయట పెట్టటానికి ఈ నాటకం ఆడవలిసి వచ్చింది,'' అంటూ ఆ వజ్రాన్ని స్వాధీనం చేసుకుని శివశర్మకు ఇచ్చి, ఇలాటి మోసాలు చేసినందుకు వీరిశెట్టికి జరిమానావేసి కఠినంగా శిక్షించాడు.



# తలవిలువ

ఒకనాడు అశోకచక్రవర్తి తన మంత్రి మొదలైన వారితో పోతూండగా దారిలో ఒక బౌద్ధ భిక్షువు కనిపించాడు. అశోకుడు ఆ బౌద్ధభిక్షువు పాదాలకు తలవంచి నమస్కరించాడు.

అనంతరం మంత్రి అశోకుడితో, "మహారాజా, మీరు దారిలో కనపడే ప్రతి సన్యాసి పాదాలకు తల వాల్చి నమస్కరించటం మర్యాదగా ఉండదు. ఇక ఎన్నడూ ఆ పని చెయ్యొద్దని ప్రార్థన," అన్నాడు.

మర్నాడు అశోకుడు తన మంత్రికి ఒక మేక తలా, పులి తలా, చచ్చిపోయిన మనిషి తలా ఇచ్చి, వాటిని అమ్ముకు రమ్మన్నాడు. మంత్రి - ఆ తలలను ఒక సేవకుడి చేత మోయించుకుని, అమ్మటానికి బయలుదేరాడు. మేకతల వెంటనే అమ్ముడయింది. తరవాత పులితలను కూడా ఎవరో ధనికులు గోడకు అలంకరణగా ఉంచటానికి కొన్నారు. కాని మనిషితలను కొన్నవారు లేరు. మనిషితలను వెంటబెట్టుకుని మంత్రి అశోకుడి వద్దకు తిరిగి వచ్చి, దాన్ని ఎవరూ కొనలేదని చెప్పాడు.

"చూశారా, మంత్రీ! మానవుడి శిరస్సుకు ఏమీ విలువ లేదు. అలాటి దాన్ని బౌద్ధ భిక్షువు పాదాలకు అంటిస్తే పోయే మర్యాద ఏమిటి?" అన్నాడు అశోకుడు.

— ఎం. కృష్ణమూర్తిరాజు





# గండుపిల్లి కాపు

పూర్వం ఒక రాజుకు నలుగురు కొడుకులు ఉండేవారు. వాళ్ళు నలుగురూ ఎప్పుడూ అంతఃపురంలోనే కాలక్షేపం చెయ్యటం రాజుకు నచ్చలేదు. కొత్త అనుభవాలు కలిగితేనే గాని ప్రపంచ జ్ఞానం కలగదని ఆయన నమ్మకం.

అందుచేత ఒక రోజు రాత్రి, జట్లుగా చదరంగం ఆడుతున్న తన కొడుకులతో, ''అస్తమానమూ ఈ కోటలోనే కూర్చున్న నాకు ప్రపంచపు వింతలేవీ తెలియటం లేదు. మీరు నలుగురూ వెళ్ళి నాలుగు వింతలు చూసి, నాకు వచ్చి చెప్పండి. సంతోషిస్తాను,'' అన్నాడు.

మర్నాడు చీకటితోనే నలుగురు రాజకుమారులూ నాలుగు గుర్రాలెక్కి బయలుదేరారు. వాళ్లు నగరం దాటి అడవి చేరగానే పెద్దవాడు, ''నలుగురమూ నాలుగు వైపులకు వెళ్ళి, కనబడిన వింతలు చూసి వచ్చి, నాన్నకి చెబుదాం,'' అని ఉత్తర దిక్కుగా వెళ్ళిపోయాడు.

పెద్దవాడు వెళ్ళిపోయాక రెండోవాడికి ఒక సందేహం వచ్చింది: ఒంటరిగా వెళ్ళిన అన్నకు ఏదయినా ప్రమాదం సంభవిస్తే, ఎవరు ఆదుకుంటారు? ఇలా అనుకుని వాడు కూడా ఉత్తరంగానే బయలుదేరాడు.

పెద్దవాళ్ళిద్దరూ ఉత్తరంగా వెళ్ళారు గదా అని మూడోవాడు కూడా అదే దారి పట్టాడు. వాడికి కొంచెం వెనకగా నాలుగోవాడు కూడా పెద్దవాళ్ళు ముగ్గురూ వెళ్లిన దారినే బయలుదేరాడు.

పెద్దవాడు చీకటి పడేదాకా ప్రయాణించి ఒక నది ఒడ్డు చేరుకున్నాడు. నదిని అనుకుని ఒక కొండ ఉన్నది. ఆ కొండ మీద ఒక పాడుపడిన ఇల్లు ఉన్నది. పెద్దవాడు ఆ రాత్రి ఆ ఇంట్లో

ఎం. కామేశ్వరరావు

గడప నిశ్చయించి, గుర్రాన్ని కిందనే వదిలేసి, కొండ ఎక్కాడు.

కొండ మీద ఉన్న పాడుబడిన ఇల్లు విశాలంగానే ఉన్నది. ఇంటి గుమ్మంలో ఒక నల్లటి గండుపిల్లి కూర్చుని ఉన్నది. అది పెద్దవాణ్ణి చూసి వికృతంగా అరిచి, పక్కకు తప్పుకున్నది.

పెద్దవాడు మూసి ఉన్న తలుపు చాలాసేపు తట్టిన మీదట, తలుపు ఓరగా తెరిచి, ఒక యోగిని తొంగి చూసింది. ఆమె జుట్టు జడలు కట్టి ఉన్నది. ఆమె పైనుంచి కిందికి కాషాయరంగుగల అంగరఖా ధరించింది. ఆమె మెడలో జిల్లేడు పూలదండ ఉన్నది. ఆమె కళ్ళు పిల్లి కళ్ళలాగా మెరుస్తున్నాయి.

"గాభరా పెట్టే గండుపిల్లి గుమ్మంలోనే కాపువేసింది. తలుపు మూసిరా!" అంటూ ఆమె లోపలికి వెళ్ళింది.

పెద్దవాడు తలుపు మూసి లోపలికి వెళ్ళాడు. యోగిని గూట్లో ఉన్న ప్రమిద తీసి వెలిగించింది. ఆ గది కిటికీలో నుంచి ధారాళంగా గాలి వస్తున్నది. ఎందుచేత నంటే, ఆ ఇల్లు కొండ అంచున ఉన్నది; ఆ కిటికీ దిగువన ప్రవహించే నది మీదికి ఉన్నది.

"తినడానికి ఏమైనా ఉన్నదా?" అని పెద్దవాడు యోగినిని అడిగాడు.




"చేపకూర కావాలా? చద్ది అన్నం కావాలా?" అని యోగిని అడిగింది.

"చేపకూరే కావాలి," అన్నాడు పెద్దవాడు.

"అయితే ఆ చేపవు నువే కావాలి!" అంటూ యోగిని తన మెడలోని జిల్లేడు పూల దండలో నుంచి ఒక పువ్వు తెంపి, పెద్దవాడి మీద విసిరింది.

వెంటనే పెద్దవాడు చేపగా మారి, విలవిలా తన్నుకోసాగాడు. యోగిని భళ్ళున నవ్వి, ఆ చేపను తీసి మంచినీళ్ళ కుండలో వేసింది.

ఈ పాటికి రెండో వాడు కూడా నది ఒడ్డుకు చేరాడు. అక్కడే పచ్చిక మేస్తూ



పెద్దవాడి గుర్రం కనిపించింది; కొండ మీద ఇల్లు కనిపించింది. సంగతి గ్రహించి, వాడు కూడా తన గుర్రాన్ని కిందనే వదిలి, కొండ ఎక్కాడు.

గండుపిల్లి రెండో వాణ్ణి చూడగానే వికృతంగా అరిచి పక్కకు తప్పుకున్నది. వాడు తలుపు తట్టేసరికి యోగిని తలుపు ఓరగా తెరిచి, "గాభరా పెట్టే గండు పిల్లి గుమ్మంలోనే కాపువేసింది. తలుపు మూసిరా," అంటూ లోపలికి వెళ్ళింది.

రెండోవాడు తలుపు మూసి లోపలికి వెళ్ళి, యోగినిని తిండిమాట అడిగాడు.

"వండడానికి కుండలో చేప ఉన్నది. వడ్డింపు వెండి పళ్ళెంలో చెయ్యనా? విస్తరాకులో చేయనా?" అని యోగిని అడిగింది.

"వెండి పళ్ళెంలోనే చెయ్యి," అన్నాడు రెండో వాడు.

"అయితే ఆ వెండి పళ్ళెం నువ్వే కావాలి," అంటూ యోగిని మరొక జిల్లేడు పువ్వు తుంచి, వాడి మీద విసిరింది. రెండో వాడు వెండిపళ్లెంగా మారిపోయాడు. యోగిని విరగబడి నవ్వుకున్నది. ఇంతలో మళ్ళీ తలుపు చప్పుడయింది. యోగిని తలుపు తెరిచి, గండు పిల్లి సంగతి హెచ్చరించి, లోపలికి వచ్చేసింది. మూడోవాడు తలుపు మూసి వస్తూ, "ఆకలి మండి పోతున్నది," అన్నాడు.

"వండడానికి చేప ఉన్నది. తినడానికి వెండిపళ్ళెం ఉన్నది. పడుకోడానికి పట్టుపరుపు కావాలా? తుంగచాప కావాలా?" అని యోగిని వాణ్ణి అడిగింది.

"పట్టుపరుపే కావాలి," అన్నాడు మూడోవాడు. యోగిని వాణ్ణి పట్టుపరుగా మార్చేసి, వంటపని ప్రారంభించటంలో నిమగ్నురాలయింది.

ఆఖరువాడు నది ఒడ్డున మేస్తున్న గుర్రాలనూ, కొండ మీది ఇంటినీ చూసి, తన అన్నలు అక్కడ ఉంటా రనుకుని, కొండ ఎక్కాడు. గుమ్మంలో కూర్చుని ఉన్న గండుపిల్లి వాణ్ణి చూసి భయం

కరంగా అరిచి, పక్కకు తప్పుకున్నది. వాడు తలుపు తట్టగానే యోగిని వచ్చి తలుపు తెరిచింది.

వాడు యోగినిని, "మా అన్నలు ముగ్గురు ఇక్కడికి వచ్చారు. కనబడరేం?" అని అడిగాడు. ఆ పాడుబడ్డ ఇంటినీ, ఆ యోగినినీ చూస్తూంటే వాడికి అనుమానం వేసింది.

యోగిని మొహం చిట్లించి, "దారే పోయే దానయ్యల సంగతి నాకేం తెలుస్తుంది? లోపలికి రావాలని ఉంటే తలుపు మూసిరా! గుమ్మంలోనే గండు పిల్లి తిష్ఠవేసింది," అని లోపలికివెళ్ళింది.

నాలుగోవాడికి యోగిని ప్రవర్తన చూసి అనుమానం మరింత అయింది. వాడు తన నడుముకు కట్టుకున్న పై బట్ట విప్పి, దానితో గండుపిల్లిని ఒడిసి పట్టుకుని చంకలో పెట్టుకుని, తలుపు మూసి లోపలికి వచ్చాడు.

వాడు గదిలోకి రాగానే కుండలోని చేప ఎగిరెగిరి పడింది. కుండ పక్కనే ఉన్న వెండిపళ్ళెం మీదా, పట్టుపరుపు మీదా జిల్లేడుపూలు కనిపించాయి. వాడి అనుమానం మరింత అయింది.

వాడు ఏమీ మాట్లాడకపోయేసరికి యోగిని, "కుండలో చేప ఉన్నది, వండనా?" అని అడిగింది.



"చేప ఎందుకు? చంకలో ఆహారం ఉన్నది," అన్నాడు వాడు.

"దాన్ని తినడానికి వెండిపళ్లెం అయినా కావాలా?" అన్నది యోగిని కోపంగా.

"కబళం తిండికి వెండి పళ్లెం దేనికీ?" అన్నాడు వాడు. యోగిని పిల్లి కళ్ళలో ఎర్రజీర కనిపించింది.

"తిండి తిన్నాక కునుకు తియ్యటానికి పట్టుపరుపైనా కావాలా?" అని అడిగింది ఆమె.

"పచ్చిక మీద పడుకునే వాడికి పట్టు పరుపు దేనికి?" అన్నాడు నాలుగోవాడు.

యోగిని పట్టలేని కోపంతో, "మిగతా ముగ్గురి కన్నా నువు పొగరు బోతువి.

నీ పొగరు అణుస్తానుండు!" అంటూ జిల్లేడుపువ్వు తెంపబోయింది.

అంతలో, నాలుగోవాడి చంకలో ఉన్న పిల్లి గది దద్దరిల్లేట్టు అరిచింది. ఆ అరుపు వినగానే యోగిని గడగడలాడి పోయింది. నాలుగోవాడు యోగిని మెడలోని జిల్లేడు పూల దండను తెంపేసి, తన చంకలో ఉన్న పిల్లిని ఆమె మీదికి విసిరాడు. గండుపిల్లి ఆమె ముఖమంతా రక్కేసి, రెండు కళ్ళూ పీకేసింది. యోగిని ప్రాణ భయంతో పరిగెత్తి కిటికీ దాకా వెళ్ళి, అనుకోకుండా కిటికీలో నుంచి, కొండ దిగువన ప్రవహించే నదిలో పడి, కొట్టుకు పోయింది.

నాలుగోవాడు, కింద పడి ఉన్న జిల్లేడు పూల దండను కూడా నదిలోకి విసిరి వేశాడు.

మరుక్షణమే చేపా, వెండి పళ్ళెమూ, పట్టుపరుపూ వాడి అన్నలుగా మారి పోయారు. "చూసిన వింతలేచాలు, ఇంటికి తిరిగి పోదాం," అన్నాడు పెద్దవాడు.

నాలుగోవాడు గండుపిల్లి కోసం అంతటా వెతికాడు, కాని దానిజాడ లేదు.

రాజు తన కొడుకులు అంత త్వరగా తిరిగి రావటం చూసి ఆశ్చర్యపడి, "అప్పుడే వచ్చారు. ఏమైనా వింతలు చూశారా?" అని అడిగాడు.

"మనిషి చేపగా మారటం అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాను," అన్నాడు పెద్దవాడు.

"మనిషి వెండి పళ్ళెంగా మారటం నాకు అనుభవమయింది," అన్నాడు రెండోవాడు.

"మనిషి పట్టుపరుపు కావటం నేను పొందిన వింత అనుభవం," అన్నాడు మూడోవాడు.

"ఒక చేపా, ఒక వెండి పళ్ళెమూ, ఒక పట్టుపరుపూ నా అన్నలుగా మారటం నేను కళ్ళారా చూశాను," అన్నాడు నాలుగోవాడు.

రాజుగారు విషయం గ్రహించి, నాలుగో వాడి భుజాన్ని వాత్సల్యంతో తట్టాడు.





# విదూషకుడు

కామందకం అనే చిన్న దేశాన్ని చంద్ర పాలుడు అనే రాజు పాలించే వాడు. ఆయన ఆస్థాన విదూషకుడైన ఆనందు డితో చదరంగం ఆడేవాడు. అందులో రాజే ఎప్పుడూ గెలుస్తూ ఉండేవాడు.

ఒకనాడు రాజు ఏదో పరధ్యానంలో ఉండి చదరంగం ఆడుతూ విదూషకుడి చేతిలో ఓడిపోయాడు. ఆయన చదరంగం బల్లను ఒక్క తన్నుతన్ని, లేచివెళ్ళాడు.

ఆయన తిన్నగా స్నానగృహానికి వెళ్ళి, తొందరపాటులో గంగాళాన్ని తన్నాడు. కాలివేళ్ళు నలిగి బాధ పెట్టాయి. ఆ గంగాళాన్ని అక్కడపెట్టిన వాళ్ళను బంధించమని ఉత్తరువిచ్చాడు.

స్నానం చేసి, రాజు దుస్తులు ధరించు కోవటానికి వచ్చాడు. రాజుగారు చొక్కా తొడుక్కుని విసురుగా పటకా బిగించు కోవటంలో ఆ పటకా కాస్తా తెగింది. ఆయన తన దుస్తులు అమర్చే అధికారిని నిర్బంధించమన్నాడు.

చాలాసేపుగా రాజుగారిలో క్షణ క్షణా నికీ పెరిగిపోతున్న కోపాన్ని చూసి పాద రక్షల బంట్రోతు వణికిపోతూ వచ్చి, రాజుగారి పాదరక్షలను ఆయన కాళ్ళ ముందు పెట్టాడు. అయితే వాడు ఆ కంగారులో కుడికాలి ముందు ఎడమ కాలి పాదరక్ష, ఎడమకాలి ముందు కుడి కాలి పాదరక్ష ఉంచాడు.

ఇదే సమయంలో అవతలి గదిలో విదూషకుడు తాను రాజుగారిని చద రంగంలో ఓడించిన సంగతి గురించి గర్వంగా చెప్పుతూ ఉండటం వినిపిం చింది. రాజుగారి కోపం తారస్థాయి అందుకున్నది. ఆయన దళాధిపతిని పిలిచి, పాదరక్షల బంట్రోతునూ, విదూషకుణ్ణీ కూడా బంధించమన్నాడు.

బాలనాగు సీతాదేవి

అర ఘడియలో దళాధిపతి తాను బంధించిన నలుగురినీ తెచ్చి రాజు ఎదట పెట్టాడు.

"వీళ్ళు నలుగురినీ రేపు ఉరి తీయించు," అన్నాడు రాజు.

కాని మర్నాడు ఉదయానికి రాజు గారి కోపం అంతా చప్పగా చల్లారి పోయింది. ఆయన నలుగురు ఖైదీలనూ తన వద్దకు రప్పించి, "మిమ్మల్ని నలుగురినీ ఉరితీయించటం నాకు ఇష్టం లేదు. మీలో ఎవరైనా ఉరిశిక్ష పడటానికి ముందుకు వచ్చేటట్టుంటే మిగిలిన ముగ్గురినీ వదిలేస్తాను," అన్నాడు.

విదూషకుడు చప్పున ముందుకు వచ్చి, "మహారాజా, వీళ్ళు ముగ్గురూ పెళ్ళాం, పిల్లలు గలవాళ్ళు. నేనంటే ఒంటరిగాణ్ణి. నన్ను ఉరితీయించి, వీళ్ళను వదిలెయ్యండి," అన్నాడు.

రాజుగారు మిగిలిన ముగ్గురినీ వదిలేసి, విదూషకుడితో, "నువ్వు ఎందుకని పెళ్లి చేసుకున్నావు కావు?" అన్నాడు.

"మహారాజా, డబ్బు లేని నన్ను ఎవరు చేసుకుంటారు? అయితే నా దొక్క మనవి. నాకు కర్మ చెయ్యటానికి, ఏటా నాకు శ్రాద్ధం పెట్టటానికి ఒక కొడుకు పుట్టినదాకా శిక్ష వాయిదా వెయ్యండి," అన్నాడు విదూషకుడు.

రాజు తనలో నవ్వుకుని, విదూషకుడికి తన ఖర్చుతో పెళ్ళి జరిపించాడు.

ఏడాది గిర్రున తిరిగే సరికి విదూషకుడికి ఒక కొడుకు కలిగాడు.

రాజుగారు విదూషకుడితో, "నీకిప్పుడు కొడుకు పుట్టాడు గదా, ఉరిశిక్ష అమలు చెయ్యమన్నావా?" అన్నాడు.

"అది ఎలా కుదురుతుంది, మహారాజా? ఆ నాడు వాళ్ళు ముగ్గురూ పెళ్ళాం, పిల్లలు గలవారని గదా వాళ్లను వదిలెయ్యటం జరిగింది? ఇప్పుడు నేనూ పెళ్ళాం, పిల్లలు గల వాణ్ణే!" అన్నాడు విదూషకుడు.

రాజు నవ్వి, "అయితే నిన్ను క్షమించానులే!" అన్నాడు.





# మహాభారతం

ధర్మరాజూ, యాజ్ఞికులూ అడిగిన దానికి ముంగిస ఇలా చెప్పింది:

"నేను అబద్ధం చెప్పలేదు. ఈ యాగం పేలపిండి దానంతో సమం కాదు. ఇది నేను స్వయంగా చూసిన సంగతి. రాలిన గింజలు ఏరుకుని కురుక్షేత్రంలో నివసించిన మునీ, ఆయన భార్యా, కొడుకూ, కోడలూ కూడా స్వర్గానికి వెళ్లారు. ఆయన వల్లనే నా శరీరంలో సగం భాగం బంగారంగా మారిపోయింది.

"నేను చెప్పిన బ్రాహ్మణుడు తన భార్యతోనూ, కొడుకుతోనూ, కోడలితోనూ ఉంఛవృత్తితో, పక్షులు జీవించినట్టుగా, జీవిస్తూ ఉండేవాడు. రోజుకు ఒక్కసారి వాళ్ళు ఆహారం తీసుకునేవారు.

"కరువు వచ్చింది. చెట్లూ చేమలూ మాడిపోయాయి. ఆ కుటుంబానికి రోజుకు ఒకసారి తినే అవకాశం కూడా పోయింది. ఒకనాటి మధ్యాన్నం తీక్ష్ణమైన ఎండలో కాలుతూ వాళ్ళు కొంత యవధాన్యం సంపాదించారు. దాన్ని వాళ్ళు పిండికొట్టి, నాలుగు ముద్దలు చేసి, నలుగురూ పంచుకుని తినబోతూండగా వాళ్ళ కుటీరానికి ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చాడు.

"ఆకలి మీద వున్న ఆ బ్రాహ్మణ్ణి వాళ్ళు లోపలికి ఆహ్వానించి, అర్ఘ్యపాద్యాలిచ్చి, దర్భాసనం మీద కూర్చోబెట్టారు. గృహస్థు తన అతిథికి తనవంతు పేలపిండి ముద్ద ఇచ్చాడు. అతిథి దాన్ని ఆరగించి ఇంకా ఆకలి తీరనట్టు

63. ధృతరాష్ట్రుడి వానప్రస్థం



కనబడ్డాడు. అప్పుడు బ్రాహ్మణుడి భార్య తనవంతు ఆహారం కూడా అతిథికి ఇచ్చింది. ఆ అతిథి బ్రాహ్మణుడి కొడుకు వంతూ, కోడలివంతూ ఆహారం కూడా తిని, సంతోషించి, తాను యమధర్మరాజునని తెలుపుకుని, అందరికీ స్వర్గప్రాప్తి కలిగినట్టు చెప్పాడు.

"అయ్యలారా, అప్పుడు నేను నా బిలంలో నుంచి పైకి వచ్చాను. ఆ పేలపిండి వాసన సోకటం చేతా, అక్కడి నీటిలో తడవటం చేతా నా తలా, సగం శరీరమూ బంగారంగా మారిపోయాయి. ఇక్కడ గొప్ప యాగం జరుగుతున్నదని తెలిసి, నా మిగిలిన శరీరం కూడా బంగారం చేసుకుందామని ఎంతో ఆశతో వచ్చాను. కాని నా ఆశ ఫలించలేదు."

ఇలా చెప్పి ఆ ముంగిస అక్కడే అదృశ్యమయింది.

ధర్మరాజు తన తమ్ములతో సహా రాజ్య పాలన చేస్తున్నాడు. ధృతరాష్ట్రుణ్ణి విదురుడూ, సంజయుడూ, యుయుత్సుడూ, కృపుడూ కనిపెట్టుకుని ఉండేవారు. కుంతి ఎప్పుడూ గాంధారి వెంట ఉండేది. ద్రౌపదీ, సుభద్రా, పాండవుల ఇతర భార్యలూ వారిద్దరినీ కనిపెట్టుకుని ఉండేవారు. వ్యాసుడు తరచుగా వచ్చి, కథలు చెప్పి పోతూండేవాడు. ఏ విషయంలో గాని ధర్మరాజు ధృతరాష్ట్రుడి మాటకు ఎదురు చెప్పేవాడు కాడు; ఆయన ఏది కోరినా సమకూర్చేవాడు. గాంధారీ, ధృతరాష్ట్రులకు పుత్రవియోగం జ్ఞాపకం రాకుండా ఉండే విధంగా పాండవులు మసలుకునేవారు. భీముడు మాత్రం ధృతరాష్ట్రుడంటే కసిగా ఉండేవాడు.

ధృతరాష్ట్రుడు దాన ధర్మాలు చేసేవాడు. బ్రాహ్మణులకు అగ్రహారాలిచ్చేవాడు. ఆయనకు అయిష్టంగా ప్రవర్తించిన వారిని శిక్షిస్తానని ధర్మరాజు తన కొలువు చేసేవారికి స్పష్టం చేశాడు. ఒక్క ముక్కలో చెప్పాలంటే ధృత

రాష్ట్రుడి కొడుకులు బతికి ఉంటే ఎలా జరిగిపోయేదో, అలాగే జరుగుతూ వచ్చింది. గాంధారీ ధృతరాష్ట్రులు కూడా పాండవులను తమ కొడుకుల లాగే చూసుకునేవారు.

ఇలా పదిహేనేళ్ళు గడిచింది. ధృతరాష్ట్రుడికి గాని, గాంధారికి గాని ఏలోటూ లేకపోయినా, భీముడు అవకాశం దొరికినప్పుడల్లా అనే శూలాల లాటి మాటలు అప్పుడప్పుడూ వారి చెవిన పడి, బాధ కలిగేది. ఈ సంగతి ధర్మరాజుకు తెలియదు.

ఒకనాడు ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో, "నాయనా, ఇంతకాలమూ నన్ను ఎంతో బాగా చూశావు. ఎన్నో దానధర్మాలు చేశాను. క్షత్రియ ధర్మం అవలంబించి చనిపోయిన నా కొడుకులు ఉత్తమ లోకాలు పొందారు. వారికి నేను శ్రాద్ధాలు పెట్టాను. ఇక నా వల్ల వారికి జరగదగిన మేలు ఏమీలేదు. నాకు లాభించే పుణ్యం సంపాదించుకోవాలి. నువు సరేనంటే, వానప్రస్థం పోదామనుకుంటున్నాను. గాంధారి కూడా నా వెంట ఉంటుంది. నేను వనంలో ఉండే నిన్ను ఆశీర్వదిస్తూ ఉంటాను," అన్నాడు.

అందుకు ధర్మరాజు ఒప్పుకోక, "నువు వనంలో కష్టాలు పడుతుంటే నేను



సుఖంగా రాజ్యం చెయ్యలేను. నువు ఉపవాసాలు చేస్తూ, కటిక నేల మీద పడుకుంటే నన్నూ, నా తమ్ములనూ లోకం నిందించదా? నాకీ రాజ్యం వద్దు, భోగాలు వద్దు. రాజ్యం యుయుత్సుడికిస్తాను," అన్నాడు.

"నాకు తపస్సు చేసుకోవాలని ఉన్నది. మన వంశం వారికి వనవాసం పరిపాటే. నేను నీ దగ్గిర చాలాకాలం ఉన్నాను. ముసలివాణ్ణి. నా వనవాసానికి నువు ఒప్పుకోవచ్చు," అన్నాడు ధృతరాష్ట్రుడు. ఆయన వానప్రస్థం వెళ్ళాలని పట్టుబట్టటమే గాక, ధర్మరాజు అందుకు ఒప్పుకోకపోతే భోజనం చెయ్యనన్నాడు.



ఆ సమయంలో వ్యాసుడు వచ్చి ధర్మరాజుతో ధృతరాష్ట్రుణ్ణి వనానికి వెళ్ళనియ్యమన్నాడు. అప్పుడు ధర్మరాజు సరేనని, ధృతరాష్ట్రుడి చేత భోజనం చేయించాడు.

ధృతరాష్ట్రుడు వనవాసం వెళ్ళుతున్నట్టు తెలిసి, హస్తినాపురంలోని అన్ని వర్ణాల వారు ఆయనను చూడ వచ్చారు. ధృతరాష్ట్రుడు ప్రజలతో, ''నేనూ, గాంధారీ కలిసి వనవాసం పోబోతున్నాం. అందుకు మీరు అనుమతించాలి. దుర్యోధనుడి కంటె ధర్మరాజు బాగా పరిపాలిస్తున్నాడని నా నమ్మకం. ఈ భూమిని మొదట శంతనుడూ, తరవాత భీష్ముడూ, విచిత్రవీర్యుడూ పాలించారు. నేను కూడా మీకు కొంత సేవ చేశాను. ఎలా చేశానో నాకు తెలియదు. అందులో ఏవైనా లోపాలుంటే క్షమించండి. మా దుర్యోధనుడు దుర్బుద్ధి అయి క్షత్రియ వినాశం తెచ్చిపెట్టాడు. అందులో నా దోషం కూడా లేకపోదు. అదంతా మరిచి పొమ్మని నేను మీకు చేతులు మోడ్చి వేడుకుంటున్నాను. ఇక నుంచీ ధర్మరాజు మిమ్మల్ని పరిపాలిస్తాడు.'' అన్నాడు.

ఈ మాట విని పౌరజానపదుల ప్రతినిధిగా ఒక బ్రాహ్మణుడు ధృతరాష్ట్రుడితో, ''రాజా, నువు మా ఎడల ఎంతో మైత్రితో ప్రవర్తించావు. మీ వంశం వారెవరూ మాకు ఎలాటి లోపమూ చెయ్యలేదు. దుర్యోధనుడు కూడా మాకు ఎలాటి ద్రోహమూ చెయ్యలేదు. నువు వనవాసం వెళితే మేం చిరకాలం సంతాపం పొందుతాం. యుద్ధం తెచ్చి పెట్టినందుకు మేం దుర్యోధనుణ్ణి తప్పుపట్టం. కురుక్షయానికి దేవుడు తప్ప మరెవరూ కారకులు కారు. ధర్మరాజు సత్పురుషుడు. ఆయన మమ్మల్ని వెయ్యేళ్ళు పాలించాలని కోరుకుంటున్నాం,'' అన్నాడు.

మర్నాడు ఉదయం విదురుడు ధర్మరాజు వద్దకు వచ్చి, ''ధృతరాష్ట్రుడు కార్తీకమాసంలో వనవాసం పోతాడు.

పోయేముందు ఆయన భీష్ముడికీ, సోమదత్తుడికీ, బాహ్లికుడికీ, తన కొడుకులకూ, ద్రోణుడికీ, సైంధవుడికీ, మిత్రులకూ శ్రాద్ధాలు పెడతాడు. అందుకు కొంత ధనం కోరుతున్నాడు,'' అని చెప్పాడు.

ధనం ఇయ్యటానికి ధర్మరాజూ, అర్జునుడూ సంతోషంగా ఒప్పుకున్నారు. కాని భీముడు మాటాడలేదు. అర్జునుడు అతనితో, ''నువు కూడా కొంత ధనం ఇయ్యి. ధృతరాష్ట్రుడు వానప్రస్థం వెళ్ళిపోతూ, శ్రాద్ధాలకని మనని ధనం యాచిస్తున్నాడు. మనం ఒకప్పుడు ఆయనను రాజ్యం కోసం యాచించిన వాళ్ళమే కదా?'' అన్నాడు.

దానికి భీముడు, ''భీష్ముడికీ, సోమదత్తుడికీ, బాహ్లికుడికీ, భూరిశ్రవుడికీ, ద్రోణుడికీ, ఇతరులకూ శ్రాద్ధాలు చెయ్యటానికి డబ్బు ఇయ్యవచ్చు. కర్ణుడి కోసం కుంతి డబ్బు ఇస్తుంది. దుర్యోధనాదులకు దేనికి? వాళ్ళు ఉత్తమ లోకాలకు పోకపోతేనేం? మనని పడరాని కష్టాలు పెట్టారే!'' అన్నాడు.

ధర్మరాజు భీముడితో, ''ఇక చాలించు!'' అని, విదురుడితో, ''ఈ భీముడు బాధపడనవసరం లేదు. ధృతరాష్ట్రుడు కోరిన ధనమంతా నేనే ఇస్తాను,'' అన్నాడు.



తరవాత ధృతరాష్ట్రుడు పెద్ద ఎత్తున శ్రాద్ధయజ్ఞం చేసి, ధర్మరాజు చేత అంతులేని దానాలు చేయించాడు. ఈ పని ముగిసిన మర్నాడు ధృతరాష్ట్రుడు గాంధారితో సహా కార్తీకపూజ చేసి, నారబట్టలు ధరించి వానప్రస్థం బయలుదేరాడు. ఆయనకు ముందుగా అగ్నిహోత్రాలు నడిచాయి. ఆయన వెంట కౌరవ, పాండవ స్త్రీలు బయలుదేరారు. ఆయన వెళ్ళిపోతున్నందుకు పాండవులు ఏడ్చారు. కుంతి గాంధారిని చెయ్యి పట్టుకుని నడిపించింది. ద్రౌపదీ, సుభద్రా, పరీక్షిత్తుతో సహా ఉత్తరా, నగరంలోని స్త్రీలూ వెంట నడిచారు. విదురుడూ,



సంజయుడూ ధృతరాష్ట్రుడితో బాటు వెళ్ళటానికి అనుమతి పొందారు.

ధృతరాష్ట్రుడు నగర ద్వారం దాటి, యుయుత్సున్నీ, కృపుణ్ణీ వెనక్కు తిరిగి వెళ్ళమన్నాడు. ఒకరొకరే వెనక్కు తగ్గారు. చివరకు ధర్మరాజు మాత్రమే మిగిలాడు. అతను కుంతితో, "అమ్మా, నువు తిరిగి వెళ్ళు. నేను ఈ మహారాజు వెంట వెళతాను," అన్నాడు.

కాని కుంతి గాంధారీ ధృతరాష్ట్రుల వెంట వెళ్ళ నిశ్చయించుకున్నది. ఆమె ధర్మరాజుతో, "నాయనా. ఈ గాంధారీ ధృతరాష్ట్రులు నా అత్తమామల లాటి వాళ్ళు. వీళ్ళను సేవిస్తూ, నేను కూడా తపస్సు చేసుకుంటాను," అన్నది. పాండవులందరూ ఆమెను వారించజూశారు. కాని ఆమె వారి మాట వినలేదు. చేసేదిలేక పాండవులు ద్రౌపదితో సహా హస్తినాపురానికి తిరిగి వచ్చారు.

ధృతరాష్ట్రుడు సాయంకాలం దాకా నడిచి గంగాతీరాన ఒక చోట నిలిచాడు. బ్రాహ్మణులు అగ్నిహోత్రాలు చేశారు. తరవాత విదురుడూ, సంజయుడూ ఆయనకూ, గాంధారికీ దర్భలతో పడకలు ఏర్పాటు చేశారు.

విదురుడి సలహాపై ఆ గంగా తీరంలోనే ధృతరాష్ట్రుడికి పర్ణశాల ఏర్పాటయింది. అక్కడ కొద్దికాలం ఉండి, ధృతరాష్ట్రుడు కురుక్షేత్రంలోని ఒక ఆశ్రమం చేరాడు. అక్కడ శతయూపుడనే రాజర్షి ఉంటున్నాడు; ఆయన తన కొడుక్కు రాజ్యం అప్పగించి, వానప్రస్థం వచ్చేశాడు. ధృతరాష్ట్రుడు తపశ్చర్యలు సాగించాడు. ఆయనను చూడటానికి ఎవరైనా వచ్చినప్పుడు వారికి కుంతి సపర్యలు చేసేది. ధృతరాష్ట్రుడు తపస్సు చేసుకుంటూ, మధ్య మధ్య అనేక కథలు వింటూ ఉండేవాడు.

ధృతరాష్ట్రుడు వెళ్ళిపోవటంతో హస్తినాపుర వాసులకు నగరం చిన్నబోయినట్టు తోచింది. వాళ్ళు ఎప్పుడూ ఆ ముసలి

రాజును గురించే మాట్లాడుకోసాగారు. ఇక పాండవుల సంగతి వేరే చెప్పనవసరం లేదు. ధృతరాష్ట్రుడే గాక, తమ తల్లి అయిన కుంతి కూడా వెళ్ళి పోవటంతో వాళ్ళు జీవచ్ఛవాలలాగా తయారయారు.

అందరికన్నా ముందు బయటపడిన వాడు సహదేవుడు. అతను కుంతిని చూడాలని తహతహలాడసాగాడు. ద్రౌపది కూడా ధర్మరాజుతో, "ఆడవాళ్ళందరూ గాంధారీ ధృతరాష్ట్రులనూ, కుంతీదేవినీ చూడాలని కోరుతున్నారు," అన్నది.

వెంటనే ధర్మరాజు ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి ప్రయాణం ఏర్పాటు చేశాడు. పౌరులు రాదలచుకుంటే రావచ్చునని ఆయన ప్రకటించాడు.

ఒక మహాసేన బయలుదేరింది. రథాల మీదా, గుర్రాల మీదా, ఒంటెల మీదా, కాలినడకనా జనం బయలుదేరారు. ఆడవాళ్ళు పల్లకిలలో ఎక్కి వెళ్లారు. యుయుత్సుడూ, ధౌమ్యుడూ మాత్రం రాజభవనంలో ఉండిపోయారు.

పాండవుల రాక తెలిసి కొందరు ఆశ్రమవాసులు వారిని చూడ వచ్చారు. ధర్మరాజు వారిని, "మా పెద్ద తండ్రి ధృతరాష్ట్రుడు ఎక్కడ?" అని అడిగాడు.

ధృతరాష్ట్రుడు స్నానం చెయ్యటానికీ, పుష్పోదకాలు తీసుకురావటానికీ



యమునానదికి వెళ్లినట్టు వాళ్లు చెప్పారు. పాండవులు వాళ్ళు చెప్పిన మార్గంగా వెళ్ళి దూరాన ధృతరాష్ట్రుణ్ణీ, గాంధారినీ, కుంతినీ చూశారు. సహదేవుడు వేగంగా పరిగెత్తివెళ్ళి, తల్లి కాళ్ళు పట్టుకుని ఏడవ నారంభించాడు. ఆమె కూడా కన్నీరు కార్చుతూ, అతన్ని లేవనెత్తి, కౌగలించుకుని, సహదేవుడు వచ్చాడని గాంధారికి చెప్పింది. ఇంతలో ఆమెకు మిగిలిన పాండవులు కూడా కనిపించారు.

తరవాత పాండవులూ, వారి భార్యలూ తన చుట్టూ కూచుని ఉంటే ధృతరాష్ట్రుడికి తాను మళ్ళీ హస్తినాపురంలో ఉన్నట్టే అనిపించింది. ఆశ్రమంలో ఉండే

మునులందరూ పాండవులను చూడ వచ్చారు. సంజయుడు వారిని విడి విడిగా ఆ మునులకు పరిచయంచేశాడు. ధర్మరాజు ధృతరాష్ట్రుణ్ణి కుశలప్రశ్నలు వేసి, "విదురుడు కనపడటం లేదేం? ఆయన ఎక్కడ?" అని అడిగాడు.

"విదురుడు తిండి మాని, ఘోర తపస్సు చేసి కృశించాడు. అతను దిగంబరుడుగా వనంలో సంచారం చేస్తూ, అప్పుడప్పుడూ కనిపిస్తున్నట్టు బ్రాహ్మణులు చెబుతున్నారు." అన్నాడు ధృతరాష్ట్రుడు.

ఆయన ఇలా అంటూండగానే దూరాన విదురుడు ఆశ్రమానికి తిరిగివస్తూ కనిపించాడు. ధర్మరాజు ఒంటరిగా విదురుడి కేసి వెళ్ళాడు. విదురుడు కీకారణ్యం మధ్య కనబడుతూ, కనపడకుండా పోతూ ఉండటం గమనించి ధర్మరాజు, "అయ్యా, విదురా! నీ కోసమే వస్తున్నాను." అని కేకపెట్టి ముందుకు పరిగెత్తాడు.

విదురుడు అరణ్యం మధ్య ఒక శూన్య ప్రదేశంలో నిలిచాడు. "నేను ధర్మరాజును." అంటూ ధర్మరాజు ఆయనకు ఎదురుగా నిలబడ్డాడు. విదురుడు దాదాపు గుర్తించ రానంతగా క్షీణించిపోయాడు. విదురుడు రెప్పవేయకుండా ధర్మరాజు కేసి చూడసాగాడు. విదురుడి అవయవాలు తన అవయవాలతో చేరిపోతున్నట్టూ, విదురుడి ప్రాణాలు తన ప్రాణాలతో ఐక్యమవుతున్నట్టూ ధర్మరాజుకు అనుభూతి కలిగింది.

తరవాత కొద్దిసేపటికి విదురుడి శవం ఒక చెట్టుకు చేరగిలబడి ధర్మరాజుకు కనిపించింది. ధర్మరాజు విదురుడి కళేబరానికి దహనసంస్కారం చేద్దామనుకున్నాడు, కాని యతులకు దహనసంస్కారం లేదు. అందుచేత ఆ ప్రయత్నంమాని, ఆశ్రమానికి తిరిగివచ్చి, జరిగిన సంగతి అందరికీ తెలిపాడు. అందరూ అమితంగా ఆశ్చర్యపడ్డారు.





## 12

సాలెవాడు మాత్రం రాజకుమార్తెకు మాటఇచ్చిన మరుక్షణం నుంచీ విచారంలో మునిగిపోయాడు. తాను ఏం చెయ్యాలి? గరుడవాహనం మీద తాను ఎక్కడైనా పారిపోవచ్చు. కాని తన ప్రియురాలు తనకు దక్కదు. విక్రమసేనుడు తన మామను చంపి, సుదర్శనను ఎత్తుకుపోయి పెళ్ళి చేసుకుంటాడు. తాను యుద్ధం చేస్తే తన చావు తప్పదు. ప్రియురాలి ఎడబాటు వల్ల కూడా తనకు చావే కలుగుతుంది. ఎలాగూ చావు తప్పనప్పుడు ధైర్యంగా చావటమే వివేకం. తాను నారాయణమూర్తి వేషంలో యుద్ధానికి పోతే శత్రువు భ్రమపడి, బెదిరి, పారిపోనూవచ్చు.

సాలెవాడు ఇలా నిర్ణయించుకునేసరికి, అసలు వైకుంఠంలో గరుత్మంతుడు శ్రీమన్నారాయణమూర్తి వారితో భూలోకంలో జరిగినదంతా చెప్పి, "దేవా, నీ రూపం ధరించి తిరుగుతున్న ఈ సాలెవాడు యుద్ధంలో చస్తే ఇక మీకు పూజా పునస్కారాలుండవు. మీలో ప్రజలకు విశ్వాసం పోతుంది. మరి ఏం చేస్తారో ఆలోచించండి," అన్నాడు.

దానికి నారాయణమూర్తివారు, "పక్షిరాజా, అక్రమంగా కప్పాలు వసూలు చేస్తున్నందుకు విక్రమసేనుడు చావాలి. పైపెచ్చు, వాడు నా భక్తులైన రాజు వంశాన్ని నిర్మూలించ జూస్తున్నాడు. నేను సాలెవాణ్ణి ఆవహించి, వాడి చక్రంలో ప్రవేశిస్తాను," అన్నాడు.

తెల్లవారు ఝామునే సాలెవాడు రాజకుమార్తె సహాయంతో యుద్ధసన్నద్ధుడైనాడు. రాజు కూడా తన సైన్యంతో



సహా యుద్ధం చెయ్యటానికి నగరం వెలువడ్డాడు. రెండు సేనలూ యుద్ధానికి తలపడ్డాయి. సాలెవాడు తన గరుడవాహనం మీద ఆకాశం మీదుగా ఎగురుతూ యుద్ధరంగానికి వెళ్ళి, సేనలకు ఎగువగా గాలిలో నిలిచి, శంఖం పూరించాడు.

శంఖనాదం విని పైకి చూసి శత్రుసేనలు, విష్ణుమూర్తే తమతో యుద్ధానికి వచ్చాడనుకుని బెదిరిపోయాయి. చాలా మంది పడిపోయారు. కొందరు మూర్ఛపోయారు. కొందరు వెర్రిగా ఆకాశం కేసి చూస్తూ ఉండిపోయారు. ఆ సమయంలో సాలెవాడు తన చక్రాన్ని విక్రమసేనుడిపై విసిరాడు. అది విక్రమసేనుణ్ణి రెండుగా నరికి, సాలెవాడి చేతికి తిరిగి వచ్చింది. అతని సామంతులందరూ సాలెవాడి ముందు సాష్టాంగపడి, శరణు వేడారు.

"ఇక నుంచీ మీరు సుప్రతివర్మకు లోబడి ఉండండి," అన్నాడు సాలెవాడు.

అందరూ అందుకు ఒప్పుకున్నారు. విక్రమసేనుడి బలాలన్నీ సుప్రతివర్మ పరం అయాయి. అనంతరం సాలెవాడు శాశ్వతంగా రాజకుమార్తెతో సమస్త సుఖాలూ అనుభవించాడు.

దమనకం చెప్పిన సాలెవిష్ణువు కథ విని కరటకం, "సరే, నీ కంత నమ్మకం ఉన్నది గనక, పింగళకం వద్దకు వెళ్ళి, నీ యుక్తి పారుతుందేమో చూడు. విజయీ భవ!" అన్నది.

దమనకం పింగళకం వద్దకు వెళ్ళి, వంగి నమస్కరించి, పింగళకం అనుమతితో కూర్చున్నది.

"నన్ను ఇంతకాలం చూడవచ్చావు కావేం?" అని పింగళకం అడిగింది.

"ఏలినవారి క్షేమ భద్రతల దృష్ట్యా ఒక అతి ముఖ్య విషయం మనవిచేయటానికి ఇలా వచ్చాను. ఒక్కొక్కసారి, యజమానికి రుచించని మాటలు కూడా భృత్యులు మనసువిప్పి చెప్పవలసి ఉంటుంది. రుచించని సత్యాలు చెప్పే

ధైర్యం విశ్వాసపాత్రులైన భృత్యులకే ఉంటుంది,'' అన్నది దమనకం.

"ఏమిటి నువు చెప్పదలచిన సంగతి?" అని పింగళకం ఆసక్తితో అడిగింది.

''మహారాజా, ఏలినవారి ఆదరానికి పాత్రమైన సంజీవకం రాజద్రోహానికి ఒడిగట్టాడు. తమరిని చంపి, సింహాసనం చేజిక్కించుకునే ఎత్తుగడలను చాలా మందికి తెలిపాడు. ఇవాళే ఈ కుట్ర అమలు జరుగుతుందట. అనువంశికంగా తమ కొలువు చేస్తున్న నా విధి గనక, తమర్ని హెచ్చరించటానికి వచ్చాను.'' అన్నది దమనకం.

ఈ వార్త విని పింగళకం అదిరిపోయింది. అది గమనించి దమనకం, ''మహారాజా, కదిలిన పంటిని పెరికెయ్యాలి. వ్యాధిని అంకురంలోనే తుంచెయ్యాలి. శత్రువుగా తయారైన వాణ్ణి నాశనం చెయ్యాలి. పరిపాలన యావత్తూ ఈ ఎద్దుకు అప్పగించి, తమరు పెద్ద చిక్కులో పడ్డారు,'' అన్నది.

''కాని, సంజీవకం ఉన్నట్టుండి నా కెందుకు ద్రోహం తలపెట్టాలి? నేను అతనికి అసంతృప్తి కలిగించటానికి ఏమీ చెయ్యలేదే?'' అని పింగళకం అడిగింది.

''దుర్మార్గుడికి కారణాలు కావాలా, మహారాజా? అతను మొదటి నుంచీ



ద్రోహబుద్ధితోనే ఉన్నాడని అనుమానం. తమరూ. ఈ ఎద్దూ లాటి బలశాలులు ఇద్దరికి ఈ అరణ్యంలో తావులేదు. అతను కపటంగా తమ అనుగ్రహం సంపాదించి, పెట్టిన చేతినే కరిచే ఉద్దేశంలో ఉన్నాడు. మీరు కృతఘ్నుడి కథ విన లేదా?'' అన్నది దమనకం.

''ఏమిటా కథ?'' అని పింగళకం అడిగింది.

దమనకం ఇలా చెప్పింది :

కృతఘ్నుడి కథ

యజ్ఞదత్తు డనే పనికిమాలిన దరిద్రుడికి గంపెడు పిల్లలు. ఒక రోజల్లా ఇంటిల్లిపాదీ పస్తులున్న మీదట యజ్ఞ

దత్తుడి భార్య కోపంవచ్చి, "పనికిమాలిన కటికవాడా, నీ పిల్లలు ఆకలికి మాడటం కనబడటం లేదా? ఏమీ పట్టనట్టు చేతులు కట్టుకుని కూర్చున్నావేం? ఎక్కడైనా వెళ్ళి ఏమైనా సంపాదించి మరీ తిరిగిరా," అన్నది.

ఈ మాటకు నొచ్చుకుని ఆ బ్రాహ్మడు ఇంటి నుంచి బయలుదేరాడు. చాలా దూరం వెళ్ళగా ఒక అడవి వచ్చింది. అతనికి దాహంవేసి, నీటి కోసం వెతక సాగాడు. కీకారణ్యం మధ్య ఒక లోతైన గుంట కనిపించింది. దాని చుట్టూ గడ్డి ఏపుగా పెరిగి ఉన్నది గాని, అందులో నీరు లేదు. యజ్ఞదత్తుడు అందులోకి తొంగిచూసే సరికి అతనికి ఒక పులీ, ఒక కోతీ, ఒక పామూ, ఒక మనిషీ కనిపించారు. గుంటలో వున్న వాళ్ళు అతన్ని చూశారు.

పులి యజ్ఞదత్తుడితో, "మహాత్మా, ప్రాణరక్షణను మించిన పుణ్యం లేదు. అందుచేత నన్ను బయిటికి తీసి, నా వారిని కలుసుకునేటట్టు చెయ్యి," అన్నది.

"నీ పేరు చెబితేనే ప్రాణులకు భయం కదా, నేను నిన్ను గుంట లోపలి నుంచి ఎలా పైకి తీయను?" అన్నాడు యజ్ఞదత్తుడు.

"అయ్యా, ఏ పాపానికైనా ప్రాయశ్చిత్తం ఉన్నదిగాని కృతఘ్నతకు పరిహారం లేదు. నా గురించి నువు భయపడవలసిన పనిలేదు. ప్రాణాపాయస్థితిలో వున్న నన్ను జాలిదలచి పైకి తియ్యి," అన్నది పులి.

ప్రాణరక్షణ యత్నంలో ప్రాణం పోయినా పుణ్యమే గదా అనుకుని ఆ బ్రాహ్మడు, వనలతలను బలమైన మోకుగా చేసి, దాని సహాయంతో పులిని పైకి లాగాడు.

"అయ్యా, నన్ను కూడా పైకి లాగు," అని కోతి బతిమాలింది. పాము కూడా అలాగే కోరింది. బ్రాహ్మడు ఆ రెంటినీ గుంట నుంచి పైకి లాగాడు.



# 150. ప్రాచీన దేవాలయ శిథిలాలు

**4000** ఏళ్ళ క్రితం బాబిలోనియనులు సామ్రాజ్యం స్థాపించారు. వారి దేవుడు "మర్దుక్". బొమ్మలో ఉన్నది మర్దుక్ దేవాలయ **అవశేషం.** భూభాగానికి పైన గల కట్టడం నాశనమై పోయింది. ఇది తవ్వకాలలో బయటపడిన భాగం. బాబిలోన్‌నగరం బాగ్దాదుకు దక్షిణంగా ఉండేది.



Chandamama, June '74 Photo by Sambhu Mukherjee



బహుమతి పొందిన వ్యాఖ్య

పడుచుతనం పాడమంటుంది

పంపినవారు: ఆర్. జయశ్రీ

Photo by Bishan Maheshwair



అమీర్‌పేట్ కాలనీ,
హైదరాబాద్ - 16.

ముసలితనం వేడుకుంటుంది

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు జూన్ 20 వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఆగష్టు నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
ప్రతిబింబం

మూడవ అట్ట:
కవలలు


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-600026. Controlling Editor: 'CHAKRAPANI'

